




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 252 THURSDAY 15th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# జనవరి 26 కే ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటుచేయడానికి సర్వప్రయత్నాలుచేస్తున్నాం

## జెరూసెలంకు ఇజ్రాయిల్ రాజధాని మార్పు

### ఐక్యరాజ్యసమితి తీర్మానానికి ప్రతిగా యూదుప్రభుత్వ నిర్ణయం

టెల్అవీవ్, డిసెంబరు 13: ఇజ్రాయిల్ ప్రభుత్వం ఈ వేళ రాత్రి తమ రాజధానిని టెల్అవీవ్‌నుండి జెరూసెలమ్‌కు మార్చడానికి నిర్ణయించింది.

ఇజ్రాయిల్ ప్రధానమంత్రి, కార్యక్రమాన్ని ఉపక్రమించాలని ప్రకటించినతర్వాతనే ఈ నిర్ణయం జరిగింది.

పార్లమెంటులో మాట్లాడుతూ ప్రధానమంత్రి బెన్‌గురియన్ ఇల్లాగ అన్నారు: "ఇప్పుడు మన పార్లమెంటు జెరూసెలంకు మార్చడానికి అడ్డంకిఏమీలేదు. మీరందరు ఈనిర్ణయం అంగీకరించాలని కోరుతున్నాను."

జెరూసెలెంపై అంతర్జాతీయ పరిపాలన ఏర్పడాలని ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం చేసిన నిర్ణయాన్ని అమలులో పెట్టాలని ధర్మకర్తృత్వ సంఘం లేక్‌సక్సెసులో సమాలోచిస్తుండగా ఈ ప్రకటన వెలువడింది.

జెరూసలెమ్‌కు రాజధానిని మార్చే ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయని ఇజ్రాయిల్ ప్రధానమంత్రి ప్రకటించారు.

రాజధానిని మార్చే విషయంమీద చర్చ జరగాలని ఒక తీర్మానం రాగా, దానికి 60 మంది వ్యతిరేకంగాను, 38 గురు అనుకూలంగాను ఓటు చేశారు.

ఛనూఖువా అనే పండుగ అయిపోగానే పార్లమెంటు సమావేశం జెరూసలెమ్‌లో జరగాలనే నిర్ణయం జరిగింది. ఈ పండుగ డిసెంబరు 25 తో ఆఖరవుతుంది.

పార్లమెంటులో ఈ నిర్ణయంమీద ఏ అభ్యంతరము రాలేదు.

(ప్రతిపక్షంలోని మితవాద పక్షంవారు, రాజధానిని జెరూసలెమ్‌కు మార్చడం చాలదనీ, ఈ విషయంలో ఇంకా తీవ్ర నిర్ణయాలు చేయాలనీ అన్నారు. అయినావారు ప్రభుత్వ నిర్ణయాలకు తమ ప్రోత్సాహం ఉంటుందని హామీ ఇచ్చారు.

4వ పేజీ చూడుడు)

## రైళ్లలో టిక్కెట్టులేని ప్రయాణీకులు

### 3 కోట్ల 24 లక్షలమంది అని సంతానం ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 13: 1949 జనవరి మొదలు జూన్‌వరకు రైళ్లలో మొత్తం 3 కోట్ల 24 లక్షల మంది టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేశారనీ, వీరివద్ద 92 లక్షల 82 వేల రూపాయలు వసూలు చేయడమైనదనీ నేడు పార్లమెంటులో స్టేట్ మంత్రి కే. సంతానంగారు ప్రకటించారు. టిక్కెట్‌లేని ప్రయాణాన్ని అరికట్టే ప్రయత్నాలు సత్ఫలితాలు ఇస్తున్నవన్నారు.

## దేశంలో సమిష్టి సహకార వ్యవసాయానికిప్రోత్సాహం

### కేంద్రప్రభుత్వం త్వరలో ఒక బిల్లును ప్రవేశపెట్టనున్న సూచన

బొంబాయి, డిసెంబరు 13: వ్యవసాయదార్ల ఆర్థిక సౌష్ఠవాన్ని బట్టి యెక్కువగా భూములు వ్యవసాయం చేయాలనే అభిప్రాయంతో భారత ప్రభుత్వం పార్లమెంటులో త్వరలో ఒక బిల్లు ప్రవేశపెట్టబోతున్నదని పి. టి. ఐ. విశేషకరి వ్రాస్తున్నాడు.

గత జూలైలో కాంగ్రెసు వ్యవసాయిక సంస్కరణసంఘం భారత ప్రభుత్వానికి ఒక నివేదిక పంపించింది. భారత ప్రభుత్వం ఈనివేదికను చాలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నదని తెలుస్తున్నది. ఈ విషయం సమగ్రంగా పరిశీలించడానికి ఒక చిన్న సంఘం నియమింపబడవచ్చునని అనుకుంటున్నారు.

ఈ మధ్యన ఢిల్లీలో జరిగిన రాష్ట్ర సంస్థాన వ్యవసాయ కార్యదర్శుల సభలో ఆహారాభివృద్ధి యెక్కువ చేయాలంటే ఆర్థికంగా లాభించే పెద్ద పెద్ద పొలాలలో వ్యవసాయం చేయించడం అవసరమని నిర్ణయించారట.

(ప్రస్తుతం అమలులో వున్న వ్యవసాయ పద్ధతులవల్ల చాలా నష్టం వస్తున్నదనీ, అందుచేత ఈ విషయంలో వెంటనే చర్య తీసుకోవాలనీ, పంట అభివృద్ధి చేయాలంటే సాముదాయిక సహకార వ్యవసాయ పద్ధతులు అవలంబించి తీరాలనీ, యివి ఆయా ప్రాంతాల అనుకూల్యాన్ని బట్టి ప్రవేశపెట్టాలనీ, కాంగ్రెసు వ్యవసాయిక సంస్కరణ సమావేశంలో సూచించారట.

దేశంలో మనకున్న వ్యవసాయ లెక్కలనుబట్టిచూస్తే, వ్యవసాయం చేసేవారిలో నూటికి 80 మందికి 10 ఎకరాలకు తక్కువ భూమే ఉన్నదట. నూటికి 60 మందికి 5 ఎకరాలకు లోపుగానే భూమియున్నది.

ఒక వ్యవసాయ నిపుణుడు పి. టి. ఐ. విశేషకరితో ఈ విషయంలో ప్రసంగిస్తూ, అమెరికా, ఆస్ట్రేలియాలవంటి దేశాలలో యంత్రాలతో అభ్యుదయకరమైన పద్ధతులు అవలంబించడంవల్లనే ఆ దేశాల వ్యవసాయం వృద్ధిపొందిందనీ, రష్యాలో మాత్రం రైతులకు భూమిని సమానంగా పంచడంవల్ల ఈ అభివృద్ధి జరిగిందనీ అన్నారు. 5 ఎకరాలకు తక్కువ భూమి ఉన్న భారతీయ వ్యవసాయదారుడు, శాస్త్రీయ పద్ధతులప్రకారం వ్యవసాయం చేయ్యలేడనీ, కేవలం కాయకష్టంవల్ల

(4వ పేజీ చూడుడు)

## మద్రాస ప్రధాని ప్రకటన

### 'నూత్నరాష్ట్ర ఆర్థికస్థితి ఆంధ్ర, కేంద్ర ప్రభుత్వాలకే సంబంధించిన విషయం'

చెన్నపట్నం, డిసెంబరు 14: "జనవరి 26 వ తేదీకే ఆంధ్రరాష్ట్రం నిర్మించడానికి సర్వయత్నాలు చేస్తున్నాము. రాష్ట్రం లోటుగా ఉంటుందో, కేంద్రంప్రభుత్వం కొత్త రాష్ట్రానికి సహాయం ఎంతవరకు చేస్తారో అది కేంద్ర ప్రభుత్వానికి, ఆంధ్ర ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారం. జనవరిలో లోటుగా ఉంటే రాష్ట్రం ఏప్రిల్ నాటికి భర్తీ అవుతుందా? లోటు అని పెట్టుకొంటే రాష్ట్ర నిర్మాణం ఎన్నటికీ పూర్తి కాదు" అని మద్రాసు ప్రధాని పూసపాటి కుమారస్వామిరాజాగారు నేడు పత్రికాప్రతినిధుల సమావేశములో మాట్లాడుదూ తెలిపిరి.

ప్ర:- ఏప్రిల్ 5 తేదీకిగాని సాధ్యం కాదని ఇదివరకు మీరు చెప్పితిన్నారే?

జ:- అవును. ఏప్రిల్ 1 వ తేదీకిగాని సాధ్యంగాదని మంత్రివర్గం వారు అభిప్రాయపడ్డారు. కాని తర్వాత విభజన సంఘంవారు సాధ్యమవుతుందని అనుకున్నారు. అంతన్న ఉత్తరం ఏమున్నదీ అని మేము 'సరే' నన్నాము. విభజన సంఘంవారి చర్చలలో జనవరి 26 లోపల ఎన్ని చిక్కులు ఎదుర్కొనవచ్చో అవన్నీ ఇప్పుడు మేము ఎల్లా ఊహించగలం?

ప్ర:- ఆంధ్రరాష్ట్రం లోటు రాష్ట్రమైతే చాలా ఇబ్బందులు ఉన్నవనీ, కేంద్రం ఇప్పుడు ఆదుకోదని నేటి ఉదయం వచ్చిన ఒక ఢిల్లీవార్తపై తాము ఏమి చెబుతారు?

జ:- ఇంకా లెక్కలుసాంతంకాలేదు. నిన్ననే ఆర్థిక సంఘంవారు సమావేశమయ్యారు. 21 వ తేదీకిగాని వారి సిఫార్సులందావు. జనవరి 26 వ తేదీకి ఆంధ్రరాష్ట్రం లోటుగా ఉంటుందీ అంటే ఏప్రిల్ 1 వ తేదీకి మాత్రం భర్తీఅవుతుందా? రాష్ట్రం నిర్మించ దలచుకున్నప్పుడు లెక్కలు చెయ్యడంలో ప్రయోజనం లేదు. లోటుగవుతుందో, దాన్ని ఎల్లా భర్తీచేయాలో అది అంతా ఆంధ్ర ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారం. మాకు సంబంధం లేదు.

ప్ర:- మీరు విభజనసంఘ అభిప్రాయాన్ని కేంద్రప్రభుత్వానికి తెలిపినారా?

జ:- తెలియజేశాను. జనవరి 26 కే రాష్ట్రంవస్తే బాగుంటుందని తెలియజేశాను. అనుదినమూ జరిగే చర్చలను, నిర్ణ

(4వ పేజీ చూడుడు)

## కొత్తరాష్ట్రం ఆర్థికంగా స్వయంపోషకమైఉండాలని కేంద్రప్రభుత్వపట్టుదల

### బళ్లారిలోని ఆంధ్రేతర తాలుకాల సమస్య: అకారణాందోళన

న్యూఢిల్లీ, డిసెంబరు 13: ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించిన వివిధ సమస్యల పరిశీలనకై, మద్రాసు ప్రభుత్వం నియోగించిన విభజనసంఘం, అనేక ముఖ్య సమస్యలపై జనవరి మాస మధ్యంలోగానే సూత్రప్రాయంగా సమాధానం కుదురటకు తావున్నదని, జనవరి 26 లోగా గవర్నర్ జనరల్ నూత్నరాష్ట్రాన్ని నిర్మిస్తూ ఉత్తర్వు జారీచేయవచ్చునని, అభిప్రాయం వెల్లడించినట్లు యిక్కడ లాబీవర్గాల ద్వారా తెలియవచ్చినది.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సంబంధించిన అన్ని సమస్యలను నూత్న రాజ్యాంగం అమలులోకి వచ్చేజనవరి 26 వ తేదీ లోగా అసంభవమని, పత్వరచర్య తీసుకొన్నప్పటికి, ఆంధ్రరాష్ట్రం అవతరించుటకు కనీసం 1950 ఏప్రిల్ వరకన్న పట్టునని మద్రాసునుండి యింతక్రితం చేసిన ప్రకటనను యీ సందర్భంలో మనం జ్ఞప్తికి తెచ్చుకోవచ్చు.

ఇప్పుడు విభజన సంఘం కొత్తగా తెల్పిన అభిప్రాయాన్ని—అనగా 1950 జనవరి 26 లోగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సాధ్యం కావచ్చునన్నది—మద్రాస్ ప్రభుత్వం తమ సమాధానంకోసమై కేంద్ర ప్రభుత్వానికి పంపినట్లు తెలియవచ్చింది. కేంద్రప్రభుత్వం, లోగడ పంపిన లేఖలో పేర్కొన్న అనేక ముఖ్య సమస్యల పరిష్కారావకాశాన్ని మద్రాసు ప్రభుత్వానికి, విభజన సంఘానికి మరి యొకసారి జ్ఞప్తిచేసూ, యీ సమస్యలపై సూత్రప్రాయంగా సమాధానం కుదిరినంత మాత్రాన చాలదని, రానున్న పరిస్థితుల స్వరూపం స్పష్టంగా, సమగ్రంగా తెలియనిదే, రాష్ట్రనిర్మాణానికి మందుచర్యలకు పైకొనట కష్టమని తెలియజేసినదని లాబీ వర్గాలవాగంటున్నారు.

నూతనరాష్ట్రం ఆర్థికంగా స్వయంపోషకమై ఉండగలదా అన్న విషయం అతి ముఖ్య విషయంగా భారతప్రభుత్వం సర్వదా పరిగణిస్తున్నది.

ఈ సందర్భంలో థార్ కమీషన్ చెప్పిన వాటిని గుర్తుకు తెచ్చుకోవచ్చు. రాష్ట్రమంతటా మద్య నిషేధాన్ని అమలు జరిపినట్లైతే, ఆంధ్రరాష్ట్రం ఆదాయంలో 6కోట్ల రూపాయల లోటు యెదుర్కొన వలసి వస్తుందని థార్ కమీషన్ హెచ్చరించింది. ప్రస్తుతం ఆర్థికంగా కేంద్ర ప్రభుత్వం అతిక్లిష్టపరిస్థితుల నెదుర్కొను

4వ పేజీ చూడుడు

## కాశ్మీర్ సమస్య:

### సమితి అధ్యక్షుడు రోములో మధ్యవర్తిత్వం?

### లేక్‌సక్సెస్ వర్గాల భావన: బి. ఎన్. రావుతో బాజ్పాయి సమాలోచన

న్యూయార్కు, డిశంబర్ 14: భారత విదేశాంగశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్ ఈ వేళ, ఆయన బసచేస్తున్న హోటలుకువెళ్లి సర్ బెనిగల్ నరసింగరావుగారితో చాలాసేపు సంప్రదించారు. భద్రతామండలిలో కాశ్మీర్ సమస్య చర్చకువచ్చినప్పుడు బాజ్‌పాయ్ భారతదేశం తరఫున ఆచర్చలో పాల్గొనబోతున్న కారణంగా ఆవాయిదాకు సంబంధించిన వివిధసమస్యలను గురించీ వీరు సంప్రదించుకుని వుంటారని ఊహింపబడుతున్నది.

భద్రతామండలిలో జరుగుతున్న ఇండోనీషియన్ చర్చముగిసినరాసరివచ్చిరావటమే నరసింగరావుగారు బాజ్‌పాయ్‌ని కలుసుకున్నారు. బాజ్‌పాయ్ యీ వేళ భద్రతా మండలిలోని వివిధప్రతినిధి వర్గాలనూ కలుసుకొని కాశ్మీర్ సమస్య విషయమైచర్చించుతారని తెలుస్తున్నది. కాశ్మీర్ కమిషన్ నివేదిక భద్రతామండలిలో శనివారం నాడు చర్చకువస్తుంది.

పరిష్కారంకోసంగా మిగిలి వున్న తక్కినసమస్యలనుగురించి సంప్రదించుకోవటానికిఅనువుగా యేచర్యలను తీసుకుంటే బాగుంటుందో సూచించమని ఉభయదేశాల ప్రతినిధి వర్గాలనూ కోరటం మంచిదని కమిషన్ సూచించింది.

మధ్యవర్తిత్వానికిగాని, పరిష్కార నియామకానికిగాని జరిగిన సూచనల రూపమేమీ యింకా బయల్పడలేదు.

సర్వాధికారాలతోనూ ఈ సమస్యను పరిష్కరించటానికిగాను ఒక పెద్దమనిషిని నియమించవలసిందిగా కాశ్మీర్ కమిషన్ శిఫారసుచేసినట్లు నిన్న తెలిసింది. కాని యీ పెద్దమనిషి యెవరైందీ మాత్రం బయటికి రాలేదు. బహుశా యీయన ఐక్యరాజ్యసమితి అధ్యక్షులై వుంటారని, జనరల్ రోమ్యులో అయివుంటారని లాబీ వర్గాలవల్ల తెలుస్తున్నది. ఇందుకు ఆయన అంగీకరించుతారో లేదో తెలియదు. ఈయన పేరు చాలామంది పేర్కొంటూ వుండటం ఆయనకు తెలుసునని ఫిలిప్పైన్ ప్రతినిధి వర్గంలో ఒకరన్నారు. అయితే ఆయనకు యిప్పటికే అనేక కార్యాలు నెత్తినవున్న కారణంగా ఇందుకు అంగీకరించకపోవచ్చునని కొందరంటున్నారు.

కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా రేపు న్యూయార్కు చేరగలరు.

బాజ్‌పాయ్ న్యూయార్కు రాగానే భారత రాయబారి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్‌ను చూడారు. ఈమె ప్రస్తుతం ఆరోగ్యం పరీక్ష చేయించుకోవటానికి హాస్పిటల్‌లో చేరి వున్నారు. విజయలక్ష్మి పండిట్ కొంచెం బలహీనంగా వున్నారు. కొద్ది రోజులపాటు సంపూర్ణంగా విశ్రాంతి తీసుకోవాలని వైద్యులు అంటున్నారు. అంతకంటే ఆమెకు ప్రమాదకరమైన అనారోగ్యమేమీ లేదు. శ్రీమతి ఒక వారంరోజులపాటు హాస్పిటల్‌లోనే విశ్రాంతి తీసుకుంటారు.

### ఇతర కాశ్మీరు వార్తలు

—5 వ పేజీలో

### హిందూ మహాసభ

కలకత్తా, డిశంబర్ 13: అఖిల భారత హిందూ మహాసభ సమావేశాలు డిశంబర్ 24 వ తేదీ నుంచి కలకత్తాలో జరుగుతాయి. సమావేశాలకు పోలీసు కమిషనర్ అనుమతి తీసుకున్నారు. ఈ సమావేశానికి డాక్టర్ యన్. బి. ఖేర్ అధ్యక్షత వహించుతారు. ఈ సమావేశంలో పాల్గొనటానికి వి. డి. సవర్కార్, యల్. బి. భోపాట్కార్ గార్లు డిశంబర్ 23 వ తేదీకే కలకత్తా వస్తారు.

## కరాచీవద్ద ఘోరమైన విమాన ప్రమాదం

### ఇద్దరుపాకిస్థాన్ సేనానులతోసహా మొత్తం 25 మంది దుర్మరణం

కరాచీ, డిసెంబరు 13: లాహోరు కరాచీల మధ్యనడిచే పాకిస్థాన్ డకోటా విమానం హఠాత్తుగా కూలిపోవడంవల్ల 21 మంది ప్రయాణీకులు నలుగురు విమానం నడిపేవారు కలిసి మొత్తం 25 గురు మరణించారని తెలుస్తున్నది.

ఈ విమానం మాదంకరాచీకి ఈశాన్యంగా 45 మైళ్ల దూరంలోఉన్న కొండదగ్గిర జరిగిందనీ కొండకు ఢీకొనడంవల్లనే ఈ ప్రమాదం జరిగిందనీ తెలుస్తున్నది.

సాయంత్రం 8.45 నిమిషాలకు ఈ విమానందగ్గిరనించి చివరవార్త వచ్చింది. ఈ వార్తనుబట్టి విమానచోదకులు విమానం నడిపించడం కష్టమైపోతున్నదని తెలిసింది.

మరణించినవారిలో ఇద్దరు పాకిస్థాన్ సేనానులున్నారు. వీరిలో ఒకరు మేజర్ జనరల్ ఇఫ్తికార్‌ఖాన్ ఈయన వట

4 వ పేజీ చూడుడు)

# తమిళనాడు ఉత్తర సరిహద్దు సంఘ తీర్మానములు

## జిల్లాబోర్డుసభ్యుడుదాసరిలక్ష్మయ్యగారిఖండన

తిరుత్తని, డిసెంబరు 11: చిత్తూరు, జిల్లాబోర్డు సభ్యులు దాసరి లక్ష్మయ్య గారిట్లు వ్రాస్తున్నారు. తమిళనాడు ఉత్తర సరిహద్దు సంఘం ఆనుకూలతో తిరుత్తని యందితీవల జరిగిన దసెటి ఒక సభలో తిరుత్తని-పుత్తూరు తెలుగువారిని రక్షించుకు చేసిన తీర్మానములను కొన్ని వార్తా పత్రికలయందు చూచి మితిలేని యాశ్చర్యమును బొందితిని.

"చిత్తూరు మండలమును ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకే చేర్చవలెను. మదరాసు నగరము ఆంధ్రరాజధానిగ నుండవలెను." అని చిత్తూరు జిల్లాబోర్డు ఇటీవల ఒక తీర్మానమును గావించిన విషయమును తమిళసోదరులు ప్రధానముగ చర్చకు దీసి కొని ఆతీర్మానమును ఖండించుచున్నామనుచు, ఇటీవల జరిగిన చిత్తూరు జిల్లా బోర్డు ఎన్నికలు తమిళ-తెలుగు సమస్యల దృష్ట్యా జరుగలేదనియు, తిరుత్తని, పుత్తూరు వగైరా జిల్లాబోర్డు సభ్యులు యీనాడు రాజీనామా నిచ్చి తమిళ-తెలుగు సమస్యలమీద మరల ఎన్నికలలో పోటీచేసి గెలువవలెననియు సవాలు చేయుచు ప్రకటించియుండిరి.

ఈ సవాలుకు బాధ్యతాయుతముగు సమాధానము నేను జెప్పవలసి యున్నదని చేయుచున్నాను. ఈనాడు యీ తమిళనాడు ఉత్తరసరిహద్దు సంఘం అధ్యక్షులుగ వ్యవహరించుచున్న యస్. రంగనాథ మొదలిగారు చిత్తూరు జిలాబోర్డు ఎన్నికలలో తిరుత్తని, పుత్తూరు తాలూకాలలోను, తదితర ప్రదేశముల లోను అరవలను సభ్యులుగ దెచ్చుటకు తీవ్రతర ప్రయత్నము లొనర్చియుండిరి. ఎవ్వరు కూడిరానందున తిరుత్తనితాలూకా అమ్మవారి కుప్పము ఫిర్కాయందు మా ప్రాంతీయములలో తమిళ ప్రాపకమునకు ఎక్కువగ కృషిచేయు చుండెడి "సెంగుందరు" జాతికి చెందిన ఒక ధనిక వర్తకుడు ముత్తుకేలప్ప మొదలిగారిని, కాంగ్రెసు అభ్యర్థి వి. రామనాథ రెడ్డిగారికి పోటీగా నిలువబెట్టి, తమిళ-తెలుగు భేదములను రేకెత్తించి, తీవ్రప్రచారము లొనర్చియుండిరి. అయినను రెండు వేల ఓట్ల మెజారిటిలో ఆంధ్రాభ్యర్థియగు రామనాథరెడ్డిగారు గెలుపొందిన విషయము యీ సవాలు జేసిన పెద్దలకు తెలియనిదిగాదని విన్నవించుచున్నాను. ప్రత్యేకముగా తమిళులకు గుణపాఠమును నేర్పిన అమ్మవారి కుప్పము ఫిర్కా ఎన్నికల ఫలితమును రంగనాథ మొదలిగారు మాత్రము గాక, ఆనాటి తీర్మాన ప్రతిపాదకులు, ఆమోదకులుగూడ సింహావలోకన మొనర్చుట మంచిదై యుండుననియు, వృథాగా దేశములోని ద్వేషములను రెచ్చగొట్టుచు వాగ్వాదములు పెంచుకొనుటలో అర్థములేదనియు గమనింపగోరుచున్నాడను.

చిత్తూరు జిల్లాబోర్డున యీనాడు నిండియున్న తెలుగుదనము ఎట్టి సవాలుకైనను ఎదుర్కొనుటకు సమాజశక్తితో తయారుగ నున్నదని యీ తమిళనాడు ఉత్తర సరిహద్దుసంఘం గుర్తింపవలయుననియు హెచ్చరించుచున్నాను.

### మునిరత్నంచెట్టిగారి ప్రకటన.

తిరుత్తని, డిసెంబరు 11: తిరుత్తని యందలి వర్తక ప్రముఖులు మోదుగూరు మునిరత్నం చెట్టిగారిట్లు ప్రకటించుచున్నారు.

ఇటీవల తిరుత్తనియందు సమావేశమైన తమిళనాడు ఉత్తరసరిహద్దు సంఘ సమావేశములో చిత్తూరుజిల్లాబోర్డువారు ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమును ఖండించుచు తిరుత్తని-పుత్తూరు వగైరా జిల్లాబోర్డు సభ్యులు తమిళ-తెలుగు సమస్యలమీద మరల ఎన్నికలకు నిలచి గెలువవలయునని సవాలుచేయుచు ఒకతీర్మానమును ఆమోదింపజేసి యుండిరనియు, ఆతీర్మాన ప్రతిపాదకులలో, కలసి తీర్మానమును నేనామోదించినట్లును ఈ డిసెంబరు నెల 1 వ తేదీ కొన్ని పత్రికలలో చూసి చాలా ఆశ్చర్యమును జెందితిని.

ఆనాడు సమావేశములో నేను ప్రేక్షకుడుగ మాత్రమే యుంటినిగాని, అతీర్మానములు తెచ్చినదిగాని, నేనామోదించినదిగాని లేదని ఇందుమూలమున ప్రకటించుచున్నాడను. బాధ్యతాయుతమైన ఇట్టి ప్రకటనలు చేయుటలో కమిటీవారుకొంత విచక్షణను గలిగియుండుట మంచిది.

### తిరుపతి దొమ్మికేసు

నేటిదినం మర్ల తిరుపతి దొమ్మికేసు, చిత్తూరుజిల్లా ఎడిషనల్ మాజిస్ట్రేటు శ్రీ కే. రంగరావుగారిచే విచారింపబడినది. ప్రాసిక్యూషన్ తరఫున 3 సాక్షులు విచారించబడిరి. మిగత సాక్షులను విచారించుటకు కేసు యీనెల 21 వ తేదీకి వాయిదా వేయబడినది. (స్వ. వి.)

### తిరుపతి పురపాలకసంఘ ఉపాధ్యక్షులుగా మునుస్వామిచెట్టిగారి ఎన్నిక

తిరుపతి, డిసెంబరు 12: ఈ పురపాలకసంఘ సమావేశము నేటిదినం చెర్మన్ సి. యస్. రామయ్య గారి అధ్యక్షతను జరిగినది.

ఖాళీబడిన ఉపాధ్యక్షపదవికి పగడాల మునుస్వామి చెట్టిగారు ఎన్నుకోబడినారు.

### చాపాడు ఫిర్కాగ్రామసేవా సంఘసభ

ప్రొద్దుటూరు, డిసెంబరు 11: మొన్న ఉదయం 11 గంటలకు అల్లాడుపల్లె వీరభద్రస్వామి దేవళంవద్ద వి. వీరబ్రహ్మం గారి అధ్యక్షతను గ్రామసేవాసంఘ సమావేశము జరిగింది. సుమారు ఒకసంవత్సరం క్రిందట యీ సంఘం స్థాపించినప్పటినుంచి గ్రామాలలో చేసినసేవ అనగా రోడ్లు మరమ్మతు, ఆరోగ్యాభివృద్ధి మొదలైన కార్యక్రమాలు క్లుప్తంగా సభికులకు అధ్యక్షులు తెలియజేశారు,

ఆనందాశ్రమంలో యీనెల 24 తేదీని ప్రారంభించే గ్రామసేవ విద్యాలయంలో ప్రతిగ్రామంనుంచి ఒకరినైనా పంపించాలనీ వారంతా గ్రామసేవకు కావలసిన తర్ఫీదు పొందాలనీ వీరబ్రహ్మంగారన్నారు.

నన్నల కొండారెడ్డిగారు, చాపాడు ఫిర్కా గ్రామ సేవా సంఘ కార్యదర్శి, గ్రామాభివృద్ధికి ప్రజలంతా సహకారం చేయాలని యేయే గ్రామాలకు, యేయే సౌకర్యాలు కావాలో విశదంగా తెలియజేస్తే ప్రభుత్వంద్వారా ఆ సౌకర్యాలు పొందవచ్చునీ అన్నారు.

భూపతి కృష్ణమూర్తి, సుబ్బరాజు గార్లు ఫిర్కా అభివృద్ధినుగురించి ప్రసంగించారు. (స్వ. వి.)

## బావుల సబ్సిడీ సహాయం

### చేగిరెడ్డి బాలిరెడ్డి గారి ప్రకటన

అనంతపురం, డిసెంబరు 10: ఆంధ్ర రాష్ట్ర రైతు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి చేగిరెడ్డి బాలిరెడ్డి గారు, బావుల సబ్సిడీ విషయమై యిట్లు వ్రాస్తున్నారు.

"అధికాహారోత్పత్తికి సంబంధించిన, కేంద్ర ప్రభుత్వోద్యోగులతో ఢిల్లీ వెళ్లినపుడు సంప్రతించగా, బావుల సబ్సిడీ యిచ్చుటకు సుముఖతను వెల్లడించారు. కొన్ని రాష్ట్రాలలో ధనరూపేణా యిచ్చు సబ్సిడీలను, రైతులు దుర్వినియోగం చేస్తున్నారని ప్రభుత్వాలు రిపోర్టు చేసినందువలన, బావుల సబ్సిడీలను రద్దు చేయాలని అంటూ కొన్ని కొన్ని ప్రాంతాలలో సబ్సిడీని యిటుక, సిమెంటు రూపంలో యివ్వాలని ఆలోచిస్తున్నట్లు తెలిపారు. ఆంధ్రదేశములో బావుల నిర్మాణమునకు, యిటుక సిమెంటు అవసరం అంతగా వుండదని చెప్పిన్న మీదట, ధనరూపేణా యిచ్చుటకే సుముఖత చూపారు. ఈ విషయం యీ మధ్య జరిగిన, ఆహార, వ్యవసాయ ఉద్యోగుల సభలో చర్చించి నిర్ణయించ గలమని కూడా తెలిపారు. ఆ సభానంతరం, పత్రికలలో, మద్రాసుకు కేంద్రము యిచ్చే సబ్సిడీలు, యిక ముందు కూడా యివ్వబడునని ప్రకటించబడినది. కాని బావుల సబ్సిడీ విషయమై, ఖచ్చితంగా పేర్కొనబడక పోవుట విచిత్రంగా వున్నది. ఈ పథకం ఫలప్రదమైనదని, పేర్కొనుచు పథకమును అమలు పరచక రద్దు చేయడంలో అర్థం లేదు. ఆంధ్రలో ముఖ్యంగా మెట్ట ప్రాంతాలకు బావుల కంటే వుపయోగమైన నీటి పారుదల సౌకర్యం మరొకటి లేదు.

మద్రాసు ప్రభుత్వం యీ విషయమై శ్రద్ధ తీసికొని సబ్సిడీలిచ్చే యేర్పాటు చేయగలదని ఆశించుచున్నాను."

# క్రిస్టమస్ పండుగ జరుపుకొనుటకు ధరలు విశేషంగా తగ్గించబడినవి

క్రిస్టమస్ పండుగను బాగ జరుపుకొనుటకు, దేశ మంతటా గల మా అభిమానులకు, అందమైన గడియారములను రూపాయి విలువ తగ్గింపు పూర్వపు ధరలకు యిచ్చుచున్నాము. ఇప్పటి స్టాకు వున్నంతవరకు యీ ధరలే నిలిచి యుండును. కొబట్టి మీ ఆర్డర్లు వెంటనే పంపుడని సలహా యిచ్చుచున్నాము. సప్లయిచేసిన ప్రతివాచీకి లిఖితపూర్వకముగు మా గ్యారంటి వుండును. పంపుటకు ముందు మా గడియారములు అనుభవము గల మెకానిక్‌లచేత పరీక్ష చేయించి, ఆర్డరులో ఫెట్టించి పంపించెదము. 15, 17 రాళ్ళు గల గడియారాలన్నీ 5 సం॥ గ్యారంటీ. మిగతవి 3 సంవత్సరాలు గ్యారంటీ. గ్యారంటీ సర్టిఫికేట్, అందమైన స్ట్రాప్, వెల్‌వెట్ పెట్టె ప్రతి గడియారంతో పంపగలము. వి. పి. ద్వారా, గడియారం పంపబడును. ప్యాకింగ్, పోస్టేజి సేల్సుటాక్సు ఉచితము.

Free

రెండు గడియారములకు ఆర్డరుయిచ్చిన ఒక అమెరికన్ ఫౌంటెన్ పేనా (గోల్డుపాలిష్ పై భాగముగలది) ఉచితముగా పంపబడును. మూడు గడియారములకు ఆర్డరుయిచ్చిన ఒక స్విస్ జేబు గడియారం, నాల్గు గడియారాలకు ఆర్డరుయిచ్చిన ఒక పెద్ద సైజు అలారం టైమ్‌పీసు పంపబడును. ఈ ఉచిత బహుమానములు తే 31-12-1949 వరకు ఇవ్వబడును.

సుంద్రని సైజు 10½

| నెం. | | రు. |
|---|---|---|
| 401 | బ్రైట్ క్రోంకేసు 5 రాళ్లు | 18/8 |
| 402 | రోల్డుగోల్డు కేసు 5 రాళ్లు | 23/- |
| 475 | క్రోం స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 28/8 |
| 476 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 35/8 |
| 477 | పూర్తి రోల్డుగోల్డు 7 రాళ్లు | 38/8 |
| 408 | క్రోం స్టీల్ బ్యాక్ 15 రాళ్లు | 33/ |
| 410 | క్రోం స్టీల్ బ్యాక్ షాక్‌ప్రూఫ్ ఆంటీ మాగ్నటిక్ 15 రాళ్లు | 48/- |
| 411 | రోల్డుగోల్డు స్టీల్ బ్యాక్ 15 రాళ్లు | 49/8 |

కర్వెక్సు సైజు 7¾

| | | |
|---|---|---|
| 422 | బ్రైట్ క్రోం కేసు 5 రాళ్లు | 31/0 |
| 423 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 5 రాళ్లు | 39/ |
| 424 | పూర్తి రోల్డుగోల్డు 5 రాళ్లు | 43/8 |
| 487 | క్రోం స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 38/: |
| 488 | రోల్డుగోల్డు స్టీల్ బ్యాక్ 7 రాళ్లు | 45/- |
| 489 | పూర్తి రోల్డుగోల్డు 7 రాళ్లు | 48/- |
| 482 | క్రోంస్టీల్ బ్యాక్ 15 రాళ్లు | 49/- |
| 433 | రోల్డుగోల్డు స్టీల్ బ్యాక్ 15 రాళ్లు | 57/8 |
| 434 | పూర్తి రోల్డుగోల్డు 15 రాళ్లు | 61/8 |

సెంటర్ సెకెండ్ సైజు 10½

| | | |
|---|---|---|
| 403 | బ్రైట్ క్రోంకేసు 5 రాళ్లు | 20/8 |
| 404 | రోల్డుగోల్డుకేసు 5 రాళ్లు | 25/- |
| 478 | క్రోం స్టీల్ బ్యాక్ 7 రాళ్లు | 30/8 |
| 479 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 37/8 |
| 480 | పూర్తి రోల్డుగోల్డు 7 రాళ్లు | 40/8 |
| 413 | క్రోం స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 41/0 |
| 414 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 54/0 |

టానూ సైజు 6¾

| | | |
|---|---|---|
| 425 | బ్రైట్ క్రోం కేసు 5 రాళ్లు | 33/- |
| 426 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 5 రాళ్లు | 41/- |
| 490 | క్రోంస్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 40/- |
| 491 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 47/- |
| 492 | పూర్తి రోల్డుగోల్డు 7 రాళ్లు | 50/- |
| 435 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 59/8 |
| 436 | పూర్తి రోల్డుగోల్డు 15 రాళ్లు | 63/8 |

వాటర్ ప్రూఫ్, షాక్ ప్రూఫ్ రేడియం డయల్ సైజు 10½

| | | |
|---|---|---|
| 459 | క్రోం స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 58 - |
| 460 | రోల్డుగోల్డు 15 రాళ్లు | 68/8 |
| 461 | క్రోం స్టీల్‌బ్యాక్ 17 రాళ్లు | 74/8 |
| 462 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 17 రాళ్లు | 85/- |
| 465 | స్టీల్ కేసు (సైజు 8¾) 17 రాళ్లు | 88 - |

నలుచదరం సైజు 8¾

| | | |
|---|---|---|
| 427 | బ్రైట్ క్రోం కేసు 5 రాళ్లు | 37/- |
| 428 | రోల్డుగోల్డు కేసు 5 రాళ్లు | 33/. |
| 429 | క్రోం స్టీల్ బ్యాక్ 15 రాళ్లు | 39/8 |
| 430 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 45/8 |
| 431 | పూర్తి రోల్డుగోల్డు 15 రాళ్లు | 49-8 |

సుంద్రని సైజు 8¾ చిన్నది

| | | |
|---|---|---|
| 405 | బ్రైట్ క్రోంకేసు 5 రాళ్లు | 23/- |
| 406 | రోల్డుగోల్డు కేసు 5 రాళ్లు | 29/- |
| 481 | క్రోం స్టీల్ బ్యాక్ 7 రాళ్లు | 29/- |
| 482 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 36/- |
| 483 | పూర్తి రోల్డుగోల్డు 7 రాళ్లు | 39/- |
| 415 | క్రోం స్టీల్ బ్యాక్ 15 రాళ్లు | 55/8 |
| 416 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 61/8 |

స్త్రీల సైజు 5¼

| | | |
|---|---|---|
| 439 | బ్రైట్ క్రోం కేసు 5 రాళ్లు | 33/. |
| 440 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 5 రాళ్లు | 41/8 |
| 444 | బ్రైట్ క్రోం కేసు 7 రాళ్లు | 41/8 |
| 445 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 7 రాళ్లు | 49/8 |
| 449 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 15 రాళ్లు | 61-8 |
| 450 | పూర్తి రోల్డుగోల్డు 15 రాళ్లు | 66-0 |
| 451 | రోల్డుగోల్డు స్టీల్‌బ్యాక్ 17 రాళ్లు | 69-8 |

SWISS WATCH COMPANY (Sec. 6)
Post Box 3552, BOMBAY 4.

# భాగ్యవంతులైన రైతులు బీదలకు సహాయం చెయ్యాలి

## రెవిన్యూ మంత్రి సీతారామరెడ్డిగారి హితవు

ప్రొద్దుటూరు డిసెంబరు 10: మద్రాసు రెవెన్యూశాఖా మంత్రి హెచ్. సీతారామరెడ్డిగారు, కె. బాలనారాయణరెడ్డి, ఎం. ఎల్. ఎ. కడపజిల్లా కలెక్టరు బి. మాధవరావు- స్వర్ణా నాగయ్య ఎం. ఎల్. ఎ. జమ్మలమడుగు రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు పి. డబ్ల్యు డి. ఇంజనీరు గారలతో కలసి కడప, కర్నూలుజిల్లా సరిహద్దు దగ్గర ఇడమడక గ్రామానికి వెళ్ళి యిటీవల వరదల వలన కె. సి. కాలువకు పడిన గండ్లను చూశారు. దారిలో వరదల వల్ల చెడిపోయిన భూములను మంత్రిగారికి బాలనారాయణ రెడ్డిగారు చూపించారు.

ప్రొద్దుటూరుకు వచ్చేదారిలో అల్లాడుపల్లె దేవళాల వద్ద చాపాడు ఫిర్కా గ్రామసేవా సంఘఅధ్యక్షులు ఆనందాశ్రమం పరిపాలన కర్తఅగు వి. వీరబ్రహ్మం గారు మంత్రిగారికి ఒక వినతిపత్రం సమర్పించారు. "గత సెప్టెంబరు నెలలోకుందు వరదల వల్ల చాపాడు ఫిర్కాలో చాలా గ్రామాలు నష్టబడినవి. సుమారు 3110 ఎకరాల భూమిబొత్తిగా వ్యవసాయానికి పనికి రాకుండా పోయింది. 8 లక్షలరూపాయల నష్టమేర్పడింది. పసువులు కూడా చనిపోయినవి. గనుక యీ ప్రాంతం రైతులకు యిండ్లు కట్టుకొనుటకు సౌకర్యము, వ్యవసాయానికి కావలసిన [illegible] పసువులు కొనుటకు [illegible] కావలసినవి కొనుటకు వడ్డీ [illegible] ప్రభుత్వం అప్పు యివ్వవలెను [illegible] పూర్తిగా పంటలు తగ్గిపోవడం మూలంగా ధాన్య సేకరణ విధానంలో మార్పు చేయవలెను" అని వినతిపత్రంలో కోరబడింది.

మంత్రి గారు సమాధానం చెప్తూ ప్రజలు ప్రభుత్వానికి అన్నివిధాలా సహకారం చేయాలనీ, విధిగా ధనికులైన రైతులు బీదవారికి సహాయం చేస్తూ, ప్రభుత్వాధికారులకు వారిఅవసరాలు తెలుపుతుంటే వాటిని నెరవేర్చటానికి వారు అన్ని విధాలా ప్రయత్నిస్తారని చెప్పారు. ఆనందాశ్రమం రోడ్డుపద్ద ఆశ్రమవాసులు, రైతులు మంత్రిగార్కి స్వాగతమిస్తూ ఆశ్రమానికి రోడ్డు వేయించాలని, రోడ్డులేక చాలా అవస్థగా యుందని చెప్పగా చాపాడు ఫిర్కా కొద్దిరోజులలో అభివృద్ధి పథకం కిందకు తెస్తామనీ, అప్పుడు వారికి అన్ని సౌకర్యాలు నెరవేరతాయనీ మంత్రిగారు సమాధానమిచ్చేరు.

వద్దులూరు పల్లెరైతులంతా, తమ గ్రామం, కుందునొద్దున ఉండడం మూలంగా వారి సర్వస్వం ధ్వంసం అయిపోయినా యనీ, వారికూనికికి, రాగిపంట పండించుకొనుటకు నీటి ప్రత్యేక సౌకర్యాలు ప్రభుత్వం యివ్వాలని కోరగా మంత్రిగారు ఇంజనీరింగు సిబ్బందిలో యీ విషయంలో తగుచర్య తీసికోమని, చెప్పుతూ యిచ్చుటయుండే ప్రభుత్వాధికారు లంతమకు కావలసిన వసతులన్నీ చూస్తారని హామీయిచ్చారు. అల్లాడిపల్లె దగ్గరయున్న ఆక్విడక్టువరదలమూలంగా కొట్టుకుపోయిన ఫలితంగా యెంత భూమి నష్టపడిందో తాసిల్దారు మధ్వాచారి మంత్రికి విశదంగా తెలియపరిచారు. మధ్యాహ్నం 12 గంటలకు మంత్రిగారు ప్రొద్దుటూరు చేరారు. జి. కృష్ణమూర్తిగారు వకీలు, మంత్రిగారి గౌరవార్థం విందుచేశారు.

మంత్రిగారు మధ్యాహ్నం 3 గంటలకు బయలుదేరి చిన్న శెట్టిపల్లె, సెమిళ్ల దిన్నె, యింకా జమ్మలమడుగులో వరదలవల్ల నష్టపడిన పల్లెలన్నీ పర్యటన చేశారు. సెమిళ్లదిన్నెలో సాయంకాలం కె. బాలనారాయణ రెడ్డిగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. జమ్మలమడుగు తాలూకా కాంగ్రెసు కమిటీవారు, వరదల వలన నష్టపడిన రైతుల తరఫున వినతిపత్రం సమర్పించారు. అందుకు సమాధానం చెప్పుచూ మంత్రిగారిట్లు ప్రసంగించారు. "భారత దేశం బీదప్రజలతో నిండియున్నది. అందులోనూ రాయలసీమ దారిద్ర్యదేవతతో తాండవమాడుతోంది. యితర దేశాలలో కష్టించి ప్రజలు పనిచేస్తారు. కాని యిక్కడ ఒట్టిమాటలు చెప్పి డబ్బుసంపాదించాలంటారు. వ్యర్థవాక్కులతో లాభం లేదు. గనుక ఆదర్శంగా పనిచేసి లాభపడాలి. గండికోట ప్రాజెక్టునుగురించి చెబ్బులాజేవాళ్ళల్లో నేనొకణ్ణి. గాని కృష్ణా-పెన్నారు ప్రాజెక్టునుగురించి ప్రభుత్వం ఆలోచిస్తోంది. అది పూర్తిఅయిన మీదట గండికోట ప్రాజెక్టును తలపెట్టడ మవుతుంది."

కె. బాలనారాయణరెడ్డి ఎం. ఎల్. ఎ. గారు ప్రభుత్వ కార్యక్రమాలు సక్రమంగా నెరవేరాలంటే ప్రజలు ప్రభుత్వంతో అన్నివిధాలా సహకరించాలని చెప్పారు.

జిల్లాబోర్డు అధ్యక్షులు టి. పుల్లారెడ్డి గారు, జిల్లా కాంగ్రెసుకమిటి అధ్యక్షులు పి. బసిరెడ్డిగారు మంత్రిగారి పర్యటనలో వెంట ఉన్నారు. కె. బాలనారాయణ రెడ్డిగారొసంగిన విందులో పాల్గొని, రాత్రి మెయిలులో మంత్రిగారు మద్రాసు వెళ్ళిరి. (స్వ. వి.)

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 16 శుక్రవారం

### మద్రాసు (ఎ)

ఉ. 7-30 వంధకోణం కమల పాట. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 సినిమా సంగీతం (రి). 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 సినిమా సంగీతం (రి). 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా. 5-30 జి. వి. రంగ నాయకమ్మ పాట. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 ఆరణి దామోదరాచార్యులు. 7-35 గీత మంజరి (రి). 7-45 జిల్లా సమీక్షణం. 8-15 దేవ కోట నారాయణయ్యంగార్, వీణ. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 విశ్వవిద్యాలయం భారత జాతీయ కవిత్వము. తెలుగుకవిత్వము. ఆంగ్లమున ప్రసంగం. 9-30 మద్రాసు (బి) వలె.

### మద్రాసు (బి)

ఉ. 7. తెలుగున వార్తలు. 7-15 ఆరియకుడి రామానుజయ్యంగార్ రికార్డులు. 7-45 మద్రాసు(ఎ)వలె. 8-30 తంజావూర్ పి.ఆర్. మణికొల్పెఫోన్. మ. 12. కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు గృహపరిశుభ్రత గృహాలంకరణ వస్తువులు ప్రసంగం. లక్ష్మీదేవి చూడబోవుట లోహపు కర్మాగారము చూడ కము వి. ఎస్. ఉన్నత పాఠశాల మద్రాసు 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మా పూరు చిత్తూరు ప్రసంగం. మన ఆహారము; ఆహారములోని విటమినల విలువ పాఠశాల దినచర్య 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు దినచర్య వడ్రంగి ప్రసంగం. పాట కథ కొంగ ముంగిస ప్రథమ చికిత్స పాముకాటు డాక్టరుగారి ప్రసంగం. సా. 5-30 మద్రాసు (ఎ)వలె. 6-20 సాయం. సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. మన ఆర్థిక రాజకీయాలు ప్రపంచనిధి సంస్థ ప్రసంగం. పీసుధ్యానాల సంపత్ గేయం 7-0 తెలుగున వార్తలు. 7-15 పరిశుభ్రత జనారోగ్యము గ్రామ వీధులలో, డాక్టరుగారి ప్రసంగం సిగరెట్ల చెల్లాయి మాగుడు బాపిరాజు గేయం 8-15 మద్రాసు (ఎ) వలె. 9-30 శ్రోతలు కోరిన పాటలు, రికార్డులు. 10-0 ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు మల్ల సూర్యనారాయణ మూర్తి.

### విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 రాజం పుష్పవనం రికార్డులు. 7-30 ఆణివిళ్ల బాలాత్రిపుర సుందరమ్మ వీణ. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 గీ తా వ ళి, సి. హెచ్. సత్యాదేవి, సి. హెచ్. కామేశ్వరి. 8-30 ఎస్. జనార్దన రావు. మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. 1 వారావళం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. సా 5-30 చిలకలపూడి వెంకటేశ్వరశర్మ. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి, సి. హెచ్. సత్యాదేవి, సి హెచ్. కామేశ్వరి. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7 తెలుగున వార్తలు. 7-30 చిత్రవాణి (రి) 7-45 జానపద సాహిత్య వైచిత్రి. తెనుగుదనము. ప్రసంగం, వేదుల సత్యనారాయణశాస్త్రి 8 ఆణివిళ్ళ బాలాత్రిపుర సుందరమ్మ వీణ. 8-30 చిలకలపూడి వెంకటేశ్వరశర్మ 9 ఆంగ్లమున వార్తలు. 9-15 శ్రీరామజననం హరికథా కాలక్షేపం, అలివేలు మంగమ్మ



# ఆలమూరు వద్ద గోదావరి వంతెనకు కళా వెంకట్రావుగారిచే శంకుస్థాపన

## ప్రాజెక్టు నిర్మాణ పద్ధతి వివరణ: తిరుమల అయ్యంగార్ స్వాగతోపన్యాసము

### "ఈవంతెనవల్ల డెల్టా ప్రాంతానికి ఇతరప్రాంతాలతో ఏకాయెకి నేలమార్గం ఏర్పడుతుంది"

—శ్రీ భక్తవత్సలం

ఆలమూరు, డిసెంబరు 14: "ధవళేశ్వరము ఆనకట్ట తరువాత రెండు శాఖలుగా చీలిన గోదావరి నదిచే ఆవృతమై యావదాంధ్రమునకు ధాన్యాగారం అనిపించుకుంటున్న డెల్టా ప్రాంతానికి ఇప్పటివరకూ భూమార్గమున రహదారి లేకపోవటంచేత ఈ ప్రాంతానికి ఇతర ప్రాంతాలతో రాకపోకల సౌలభ్యం లేక ఒక ద్వీపంవలె ఉండిపోయింది. ఈ కారణంచేత ఆలమూరువద్ద ప్రారంభించిన రెండు నదీ శాఖల అవతలిగట్టులకు రోడ్డువంతెన వెయ్యటానికి ప్రభుత్వం నిశ్చయించింది. రమారమి 15 వేల అడుగుల పొడవు ఉండగల ఈ వంతెన కయ్యే ఖర్చు 2 కోట్ల రూపాయలని అంచనా వేయబడింది" అని నేడు ఆలమూరువద్ద గోదావరి వంతెనకు శ్రీ కళా వెంకట్రావుగారు శంఖుస్థాపన చేసే సందర్భంలో మద్రాసు రహదార్ల ప్రధాన ఇంజనీరు ఎం. ఎస్. తిరుమలఅయ్యంగార్ స్వాగతోపన్యాస మిస్తూ అన్నారు.

ఈ మహోత్సవమునకు పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి గౌ॥ భక్తవత్సలం గారు అధ్యక్షత్వం వహించారు.

తిరుమల అయ్యంగార్ తమ ఉపన్యాసంలో ఇంకా ఈ క్రింది వివరాలు తెలిపారు.

"గోదావరి పై రైల్వే వంతెనలు చాలా ఉన్నప్పటికీ రోడ్డు వంతెనలు ఒక్కటి కాకి వద్ద చిన్న వంతెన తప్ప మరొక్కటైనా లేవు. ఇటువంటి రోడ్డు వంతెనల ఆవశ్యకతను గూర్చి కేను వివరంగా చెప్పనక్కర లేదు. రాకపోకలు, సరుకుల రవాణా యావత్తూ పడవల పైన, బల్లకట్టుల పైన ఎండలో, వానలో అతికష్టం మీద జరుగుతున్నది. ఈ పద్ధతిలో ప్రమాదం సంగతి అలావుంచి అనవసరంగా విలేన ధనం వ్యయమై పోతున్నది.

1937వ సంవత్సరమున అనగా ఇప్పటికి ఒక పుష్కరము క్రితము చెన్నరాజధానియందు రహదారుల అభివృద్ధికి శైలస్ తయారు చేసిన పథకమునందు గోదావరిపైవారధినిర్మాణసూచన రూపొందినదని చెప్పవచ్చును. ఈ పథకము కేంద్రప్రభుత్వ మోదమును పొంది 1939వ సంవత్సరములోనే అంచనాలు తయారు అయినప్పటికిని, ఆ సంవత్సరమే ప్రపంచ మహా సంగ్రామము ప్రారంభమగుట వలనను, సమరము పరిసమాప్తమైన అనంతరం, ఏర్పడిన అసాధారణ పరిస్థితులవలనను ఈ పథకమునకు స్థిరరూపమును కల్పించుట సాధ్యము కాలేదు. యుద్ధానంతరపు రహదారుల అభివృద్ధిపథకములను తయారు చేయు సందర్భమున గోదావరివంతెనయే కాక, ఇతర పెద్దనదులగు పెన్నానది, కృష్ణానదుల పై గూడా వంతెనలు నిర్మించి మద్రాసు, కలకత్తా రాజమార్గము ఈ రాష్ట్రమునకు సంబంధించినంతవరకు పూర్తి చేయవలెనని నిర్ణయింపబడెను. సహజముగ గోదావరి వంతెనకు అగ్రస్థాన మొసగిరి, ప్రథమ పంచవర్ష ప్రణాళికయందు ఈ వంతెన నిర్మాణము చేర్చబడినది.

వారధి ఎక్కడ నిర్మించ వలెనను విషయము చర్చకు వచ్చినప్పుడు రాజమండ్రి రైలువంతెన సమీపములోనే రోడ్డు వంతెనను కూడ నిర్మించుట ఇంజనీరుల దృష్ట్యా సులభమని, ఆర్థికదృష్ట్యా లాభకరమని భారత ప్రభుత్వం ఒకప్పుడు అభిప్రాయ పడినప్పటికీ, దీనివలన గోదావరి శాఖా ద్వయం మధ్య గల డెల్టా ప్రాంతానికి ఏ మాత్రం లాభం కలుగదని ఎంచి రాష్ట్ర ప్రభుత్వం వారు డెల్టా ప్రాంతమును ప్రధాన భూభాగంతో కలుపునట్లుగా వంతెన నిర్మింపబడాలని కేంద్ర ప్రభుత్వమునకు నచ్చ చెప్పారు. దాని ఫలితంగానే ఇప్పుడు ఆలమూరు వద్ద వంతెన ప్రారంభింప బడుచున్నది.

గౌతమ, వసిష్ఠ అను గోదావరి శాఖల రెంటిపై నిర్మాణముగానున్న వారధివలన పశ్చిమ గోదావరియందలి కుంచనపల్లి, తూర్పు గోదావరియందలి ఆలమూరులకు రహదారి సంబంధము ఏర్పడును. ప్రస్తుతమున్న రాచబాట పశ్చిమ గోదావరిలోని గుండుగొలను సమీపమున 318 వ మైలు నుండి ఇప్పటి డెల్టా రహదారులను అనుసరించి తణుకు, తాడేపల్లి గూడెము, ఉండ్రాజవరము మీదుగవచ్చి కుంచనపల్లి వద్ద ఈ క్రొత్త వంతెనను చేరునట్లుగ మార్పు చేయబడును. తూర్పుగోదావరిజిల్లాలో అమలాపురమునుండి ద్వారపూడి, అనపర్తి, సామర్లకోట, పిఠాపురం వరకు ఉన్న ఇప్పటి డెల్టా రహదారిని హైకీసుకొని పోయి, కత్తిపూడి సమీపమున 407 వ మైలువద్ద రాచబాటతో చేర్చబడును. ఈ పథకమునకు ఖర్చు రాజమహేంద్రవరమువద్ద గోదావరిపై నిర్మించు వంతెన ఖర్చుకంటె అధికముగనే యుండును. 105 లక్షల రూపాయలకుపైనున్న అధనపు ఖర్చును రాష్ట్ర, కేంద్రప్రభుత్వములు సమముగ భరింపవలెనని భారత ప్రభుత్వము చేసిన సూచనను చెన్నరాష్ట్ర ప్రభుత్వము అంగీకరించినది.

గోదావరి రెండుశాఖల గట్టులకు వేయబడు వంతెన పొడవు 15,000 అడుగులుండును. భారతదేశమున ఇంతపొడవుగల




నదీవంతెన మరొకటిలేయుండదని చెప్పవచ్చును.

నిర్మాణమునకు సంబంధించిన కొన్ని సమస్యలపై అంత్యనిర్ణయములు అనతికాలములోనె జరుగును. వారధిపొందిక, కూర్పు నిర్ణయమైనవి. ఈ ప్రాజెక్టు ఉపక్రమణికకు కాలమాసన్నమైనది. వారధి నిర్మాణారంభమునకు పూర్వము జరుగవలసిన ప్రాథమిక ప్రాతిపదిక పనులన్నియు తక్షణమే ప్రారంభమగును.

ఇక వారధినిర్మాణమునకు సంబంధించిన ముఖ్యవిషయములను కొన్నింటిని వివరింతును. నదీగర్భమునకు 80 అడుగుల లోతునుండి కట్టుకొనివచ్చిన స్తంభములపై వంతెనవనిర్మాణము జరుగును. రీ-ఇన్‌ఫోర్సుడు కాంక్రీటుతో ధనురాకారము గల గర్డరులతో 150 అడుగుల స్పానులతో వంతెనను నిర్మించుటకు నిర్ణయింపబడెను. వంతెనపై రహదారి వెడల్పు 24 అడుగులు ఉండును. ఈ వంతెన నిర్మాణమునకు 4501 టన్నుల ఇనుము 12,000 టన్నుల సిమెంటు కావలసియుండును. దీని నిర్మాణమునకు మొత్తముఖర్చు రెండు కోట్ల రూపాయిలు ఉండునని అంచనా వేయబడెను. 70 టన్నుల బరువుగల పాయింట్ ట్యాంకు రిగసాయముగ ఈవంతెనమీదుగా నడ్వగలదు.

ఒక మహత్కార్యభార నిర్వహణకు మేము పూనుకొంటిమి. ఆంధ్రరాష్ట్రము తలపెట్టనున్న ఈ పథకముమూలా ర్థమున ప్రారంభమైన ఈవారధి ప్రశస్తమైన వారధి కాగలదు. ఈ రాష్ట్రము సగర్వముగ దీనిని సూచించి చెప్పుకొనగలదు. ఈమహత్కార్యమును సాధించినందుకు ఈ రాష్ట్రము గర్వింపవచ్చును. ఇచటసమావేశమైనవారును, ఈ ప్రాంతము వారందరును, తమ అపరిమిత ఉత్సాహమునకు, కార్యదీక్షతకు ప్రసిద్ధికెక్కిన ఆంధ్రులు. ఉత్సాహముతో, విశ్వాసముతో, ధైర్యముతో ఈ మహత్కార్య నిర్వహణను ఉపక్రమింతుము. ఇతరసులగు తనవాదార్యముతో అన్నపానాదులనొసగి పెంచు కొనివచ్చిన గౌతమతల్లి గోదావరి ప్రాంతీయుల నందరిని తన సంతానముగనే భావించుకొనుచున్నది. కనుక తనసంతానము తమసౌకర్యముకొరకు తనపై వారధిని, తన సహజస్వాభావ ప్రవాహమునకు గౌరవ పురస్సరముగ సకల సదుపాయములను కల్పించుకొని నిర్మింప గోదావరి మతల్లి హృదయ పూర్వకముగ సహకరించి మన కార్యక్రమము ప్రతిఫలించుటకు సహాయపడునని గూచించుట కేవలము భ్రమకాబోవచ్చును.

ఈ ప్రాంతమునజన్మించి గోదావరి పానోదకముతో పెరిగి పిలుపునిచ్చినంతనే మంత్రిపదవిని విసర్జించి అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శిపదవిని స్వీకరించిన శ్రీ కళా వెంకట్రావుగారు ఈ ఉత్సవములో పాల్గొనుట ఎంతేయు ఉచితముగ నున్నది.

ఈ మహోత్సవమునకు అధ్యక్షతను వహించిన మంత్రి శ్రీ భక్తవత్సలము గారి —వీరిహయాము ప్రాంతీయాభిమానములకు ఆస్కారములేక, రాజధానియందలి ఆంధ్రతమిళ, కేరళ, కర్ణాటక ప్రాంతము లన్నిటిలో వరుసక్రమముగ ప్రయోజనకరమైన ప్రాజెక్టుల ఉపక్రమణికను వీక్షించుచుంటిమి. అట్టివారు ఈ మహోత్సవమునకు అధ్యక్షతవహించుట ఎంతయు సముంజసముగ నున్నది.

### భక్తవత్సలంగారి అధ్యక్షోపన్యాసం

"గోదావరి వంతెన స్కీము చరిత్రను గూర్చి, దానికి సంబంధించిన టెక్నికల్ సమస్యలను గూర్చి ప్రధాన ఇంజనీర్ చెప్పిన విషయాలు మీరు విన్నారు. ఈ స్కీము గొప్పదనాన్ని మీరంతా గుర్తించే వుంటారు. గోదావరి ఇండియాలోని పెద్ద నదులలో ఒకటి. ఈ నదికి రోడ్డు వంతెన నిర్మించవలసిన ఆవశ్యకత ఎన్నో ఏళ్ల నుండి ప్రజలను, ప్రభుత్వమును బాధిస్తున్నది ... లేదు. ... కొంత నిరాశా, ... యత్నించకపోవటంలో ఆశ్చర్యం లేదు. ఈ స్కీము ఇంతవరకు ప్రారంభింపకపోవటానికి కారణం ప్రభుత్వానికి దీనిపై శ్రద్ధగాని, పట్టుదలగాని లేకపోవటం కాదు. ఈ పని తేలిగ్గా జరిగేది కాదు. బ్రహ్మాండమైన ఇంజనీరింగు సమస్యలెన్నో ఇందులో ఇమిడి వున్నవి. ఆర్థికంగాకూడా విశేష ధనమును వెచ్చిస్తేకాని సాధ్యము కాదు ఇది.

లాభాలకే ప్రధాన లక్ష్యంగా చూచుకునే ఇదివరకటి రైల్వే కంపెనీవారు కూడా పూర్వలోనే రైల్వేపడిన ఎన్నో ఏళ్ళకు గాని రాజమండ్రివద్ద రైల్వేవంతెన కట్టడానికి సాహసించలేకపోయారు. కారణమేమిటి? ఇది ఎంతో వ్యయం, శ్రమతో కూడుకొన్న పని కావటమే. అలాగే రోడ్డు వంతెన విషయంలో కూడా 1935 కు ముందు ఎవ్వరూ సుసాధ్యమని అనుకోలేదు ... సాహసించలేకపోయారు. కేంద్రరహదార్ల నిధిని భారతప్రభుత్వం స్థాపించిన తరువాత ఆ నిధిలో కొంత మొత్తం ఈ రాష్ట్రానికిఇవ్వబడిన తరువాత ఈస్కీము సాధ్యమేనన్న ఆలోచన కలిగింది. ఈ ఆలోచన ప్రకారం ఆలమూరువద్ద గౌతమీశాఖకు వంతెనను కట్టాలని నిశ్చయింపబడింది. దీనిని 1939 లో కేంద్రప్రభుత్వం అంగీకరించింది.

తరువాత 1947 లో గాని ఈ స్కీమును తిరిగి తలపెట్టడానికి వీలు చిక్కలేదు. కాని అప్పటికి మరికొన్ని చిక్కులు వచ్చాయి. మొదట అనుకున్న ఖర్చు అంచనా కాలంగడిచేట్లు పెరిగి 2 కోట్ల రూ. లయింది. దీనిని భరించట మెలాగా అని ఆలోచిస్తున్న సమయంలో ఈ రాష్ట్రంలోని ప్రధాన రహదారుల అభివృద్ధి విషయంలో కొంత సహాయం చేస్తామని కేంద్ర ప్రభుత్వంవారన్నారు. ఈ రహదారులలోకి గోదావరి వంతెన కూడా వచ్చింది. అయితే అది మద్రాసు-కలకత్తా ప్రధానమార్గంలో అనగా రాజమండ్రి సమీపంలో మాత్రమే కట్టబడవలసి వున్నది. చివరకెలాగైతే నేమి ఈ చిక్కునుకూడా దాటాము. 1949 జూలైలో కేంద్ర ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వం చేసిన సూచనలన్నిటికీ అంగీకరించింది. ఈ రోజున వంతెన కట్టవలసినచోటు, విధానము అంతా ఖచ్చితంగా నిర్ణీతమైవుంది.

కాని కట్టవలసిన వంతెన పొడవు, వెడల్పు విషయం ఇంకా ఇంజనీర్లు పరిశీలిస్తున్నారు. ఈ విషయమై కొద్దివారాలలో నిర్ణయం జరుగుతుందని ఆశిస్తున్నాను. పూనా పరిశోధనశాలలో జరుగుతున్న నమూనా పరిశోధనల మూలంగా వ్యయమును తగ్గించటానికి, నదిని అదుపుచేయటానికి, కొలువల్కుద్వటానికి ... వీలవుతుంది అనేవిషయం తేలుతుంది.

ఇక్కడ నదీగమనం కొంచెం అస్థిరంగాను, వరదలకు అనువుగాను ఉన్నట్లు విన్నాను. కనుక ఈ విషయాలన్నిటినీ విచారించి సరియైన నిర్ణయాలు చేయుటానికి మనం ఇంజనీర్లకు కావలసినంత వ్యవధియివ్వాలి. ఆదరాబాదరాగా ఉపక్రమిస్తే డబ్బు వృథా, శ్రమ వృథా కాగలదు.

ఏమైనా త్వరలో ఈ స్కీము పూర్తి కాగలదని ఆశిస్తున్నాను. ఎందుకల్లనంటే రాకపోకల సౌకర్యం మాట అలావుంచి, ఈ ప్రాంతంలోని లక్షలాది ప్రజల ఒంటరితనాన్ని, అది కలుగజేసే నిరుత్సాహాన్ని మనం పోగ్రోలవలసివుంది. ఇక్కడ నిర్మింపబడనున్న వంతెన చాల సుందరమైన దృశ్యంగా తయారవుతుందని నేను విన్నాను. వచ్చే ఏడు ఈరోజులకల్లా ఈప్రదేశంలో ఇంజనీర్లు తేపపట్టులోని తేనెటీగలవలె చురుకుగా తమ పనిని కొనసాగిస్తూ వుంటారని, నిర్ణీత కాలమైన 1955 కల్లా వారధినిర్మాణాన్ని పూర్తిచేస్తారని ఆశిస్తున్నాను."

భక్తవత్సలంగారు తమ ఉపన్యాసాన్ని ముగిస్తూ కళా వెంకట్రావుగారిని శంకుస్థాపన చేయవలసిందిగా కోరారు.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 14:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-5 ఎవ్వర్డు బొమ్మ సీలు టాక్సుతో సహా రు. 16 12-0 పెట్లా ... తులం 115-4-0 మూసబంగారు 113-10-0 సీమవెండి తులం 1 0-... (రెడి 174-0-0 వెండి తులం 1-12-6

వేరుసెనగ: (581 పౌ 1-5 ఎన్ను కొ గ్రాసింగులు) మెషీను (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది 163-0-0 163-4-0

(కోరమాండల్)

వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ (పెదరేజి) రు. 828-0-0 3% యఫ్. యఫ్. ఎ. ... 87 ... గల ...) ఒకటికి ... క్వెలాన్. రు. 87-12-0, 89-8-0

ఆముదం

క్యాండీ 500 పౌనులుగలది రు. 265-0-0 (ఒంగోలు) నరసరావుపేట) రు. 280

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 13:

మార్చివాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి ప్రారంభం | వల | 30.14 | |
| | నిన్న | | 30.16 |
| ,, | ముగింపు | వల | 30.18 |
| | నిన్న | | 30.16 |

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ దశమి 1949 సం॥ డిసెం॥ 15 గురువారం

బ॥ దశమి ప 2-11 చిత్ర రా 1-24 వర్జ్యం ప 10-30 ల 12-4 వ.

బ॥ ఏకాదశి డిసెం॥ 16 శుక్రవారం

బ॥ఏకాదశి,ప11-36స్వా రా11-25 వర్జ్యం ఉ 6-33 ల 8-1 వ. తె 4-31 ల 5-59వ



ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర బ॥ దశమి

గురువారం

## వ్యర్థప్రయత్నములు

కాశ్మీరు ఒక అంతర్జాతీయ సమస్యగ పరిణమించుటకు, ఆ సమస్య ఇంతవరకు పరిష్కారము గాకుండుటకు పాకిస్తాన్ ప్రభుత్వ విధాన, వైఖరులే కారణమని సమితి మధ్యవర్తిసంఘము గ్రహించినను, ఆ విషయమును స్పష్టముగ ప్రకటించుటకు అదినుండియు సంకోచించుటవలన సంస్థానము నందలి పరిస్థితులు విషమించుటే గాక, అసలు కాశ్మీరు సమస్య మరింత క్లిష్టమైనది. భారత ప్రభుత్వము రెండు సంవత్సరముల క్రితము పాకిస్తాన్ దురాక్రమణపై ఫిర్యాదు చేసినప్పటికి పాకిస్తాన్‌కు కాశ్మీర్ దురాక్రమణతో ఎంతవరకు ప్రమేయము గలదను విషయము భద్రతామండలికి అవగతము కాలేదు. పాకిస్తాన్ ప్రభుత్వము ప్రారంభదశలో తనసేనలు కాశ్మీరు సంస్థానమునందు లేవని, సరిహద్దు కొండజాతులను కాశ్మీరు యుద్ధమునకు తాను ప్రోత్సహించి యుండలేదని వాదించియుండెను. భద్రతామండలి భారత ప్రభుత్వ ఫిర్యాదును పరిశీలించి, పరిస్థితులను విచారించి, సాధ్యమైన ఇరుపక్షములకు సమాధానము కుదుర్చుటకు ఒక ఉపసంఘమును నియమింప తీర్మానించుకొను సమయమున, పాకిస్తాన్ తన గుట్టు వెల్లడికానున్నదని గ్రహించి సమితి ఉపసంఘము విచారింపవలసిన యంశములను విస్తృతము చేయుటకు ప్రయత్నించెను. ఆ ప్రయత్నములు ఫలించినప్పటికిని, పాకిస్తాన్ సంకల్పము మాత్రము సిద్ధింపలేదు: కనుకనే కాశ్మీరు సంస్థానమునందు కేవలము ఆత్మరక్షణకు పాకిస్తాన్ తన సేనలను ఉంచవలసివచ్చెనని విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ ఐక్యరాజ్య సమితి కాశ్మీరు కమిషన్‌కు వ్రాసుకొనవలసి వచ్చెను.

భద్రతామండలిగాని, కాశ్మీరు కమిషన్‌గాని పాకిస్తాన్ ఒప్పుదల వలన ఏర్పడిన "క్రొత్త సమస్య"ను సమితి ప్రణాళిక ననుసరించి పరిష్కరించుటకుబదులు, దురాక్రమణ సలిపిన పాకిస్తాన్ ప్రభుత్వమును, దురాక్రమణనుండి సంస్థానమును సంరక్షించిన భారత ప్రభుత్వమును సమముగ పరిగణించి ఇరుపక్షములకు సమాధానము కుదుర్చుటకు ప్రయత్నించెను. కాశ్మీరు కమిషన్ ఈ విధముగ దురాక్రమణ చర్యలను 'శాసనబద్ధము' చేయుటవలన పాకిస్తాన్ సమాధానమునకు వచ్చుటకు నిరాకరించుచున్నది. కాశ్మీరు కమిషన్ సభ్యులు పాకిస్తాన్ ప్రభుత్వమునకు స్వస్వరూప జ్ఞానము కల్గించుటకుబదులు సమాధానము కుదురుటకు పాకిస్తాన్ అంగీకరించిన పరిష్కారమునకు భారత ప్రభుత్వ అంగీకారమును సంపాదించుటకు ప్రయత్నించెను.

ఆ ప్రయత్నములు విఫలమగుటవలన కాశ్మీరు సమస్యా పరిష్కారమునకు మధ్యవర్తిత్వ కారములతో ఒక పరిష్కర్తను నియమింపవలెనని కాశ్మీరు కమిషన్ భద్రతామండలికి సూచించెను. సమాధాన మార్గము నగాక, పరిష్కర్త తీర్పువలననే కాశ్మీరు సమస్య పరిష్కారము కాగలదని యూహించుచు కాశ్మీర్ కమిషన్ సూచించిన అసమర్థతను అంగీకరించెను. అది నుండియు కమిషన్ అనుసరించిన విధానఫలితము ఇందుకు భిన్నముగ నుండజాలదు కాని భద్రతామండలి కమిషన్ సూచనను అంగీకరించి పరిష్కర్తను నియమింప దలచిన పరిష్కర్త తీర్మానింపవలసిన విషయములు ముందుగ, విస్పష్టము కావలెను సంస్థానమునుండి పాకిస్తాన్, ఆజాద్ కాశ్మీర్ సేనల ఉపసంహారము విషయమున మధ్యవర్తి తీర్పుకు అవకాశము లేదని భారతప్రభుత్వము అనేక సందర్భములందు స్పష్టముచేసెను. అయినప్పటికిని కాశ్మీరు కమిషన్‌వారు ఈ విషయమునుకూడ పరిష్కర్త తీర్పుకునివేదింపవలెనని సూచించిరి. ఇందుకు భారతప్రభుత్వము ఎన్నటికి సమ్మతింపజాలదు. కాశ్మీరు కమిషన్ దాదాపు 20 మాసములు ఎంతతీవ్రముగ కాశ్మీరు సమస్యా పరిష్కారమునకు ప్రయత్నించినప్పటికిని, గత సంవత్సరము ఆగస్టులో పరిస్థితులు ఎట్లున్నవో నేడును అట్లే యున్నవి. కాశ్మీరు కమిషన్ సూచించిన మార్గమును భద్రతామండలి అనుసరించినను ఈ సమస్య పరిష్కారము కాగలదనుటకు అవకాశము లేదు. భద్రతామండలి దృక్పథము మారి వాస్తవిక దృష్టితో సమస్యను పరిశీలించి నూతన విధానమును అనుసరింప సిద్ధపడినగాని ప్రయోజనము ఉండదు. లేకున్న పరిష్కర్తను నియమించి నప్పటికిని కాశ్మీర్ కమిషన్ సాధించలేకపోయిన "మహాకార్యము"లను పరిష్కర్త సాధింపజాలడు.

## ఆంధ్ర తుపాను బాధితుల సహాయనిధి

### తుపాన్‌నిధికి మినర్వాటాకీస్ విరాళం

మదరాసు, డిసెంబర్ 13: మినర్వా టాకీస్ వారు నిన్నటిదినము వసూళ్ల మొత్తం రూ 350/- గవర్నరు గారి ఆంధ్ర తుపాన్ సహాయనిధికిగాను నగర కమిటీ అధ్యక్షుడు డా॥ పి. వి. చెరియన్ గారికి అందజేసిరి.

### ఆంధ్రమహిళాసభ వసూళ్లు

మదరాసు, డిసెంబరు 4: ఆంధ్ర మహిళాసభ కార్యదర్శిణి శ్రీమతి ఎ. వి. కృష్ణారావుగారు చందా లిచ్చిన ఈ దిగువ వారికి కృతజ్ఞత తెలుపుచూ ఇంకనూ విరివిగా చందా లివ్వమని కోరుచు యీ జాబితా ప్రకటించిరి.

సర్ అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్ రు. 500 చెన్నరాష్ట్ర జిల్లాపై గ్యుల సహకార ఫార్మర్సుఅండ్ స్టోర్సు రు300, వసంత మిల్సు రు 250 నగర న్యాయవాదుల సంఘం రు 170 ఎలిరాజ్ కళాశాల రు 60 శ్రీ అనంత పద్మనాభాచార్యులు రు 50 టి. పట్టాభిరామరెడ్డి రు. 50 ఇంజనీరింగ్ కళాశాల సేవాసమాజం రు. 35 ఆంధ్రాబ్యాంక్ రు. 32 విజయ కెమికల్సు అండ్ టాయిలెట్సు రు. 25 శ్రీ యస్. యన్. మూర్తి రు. 25 రేడియో ఎలెక్ట్రికల్సు రు. 20 లు.

నేటివరకు మొత్తం వసూళ్లు రు 10,654-5-3 గవర్నరు ఆంధ్రతుపాన్ సహాయనిధికి అందజేసినది. రు10,000/-లు

## ఆస్ట్రేలియా కార్మిక ప్రభుత్వ రాజీనామా

కాన్‌బెర్రా, డిసెంబరు 12: ఎనిమిదేళ్లపాటు ఆస్ట్రేలియాలో అధికారం చెలాయించిన కార్మికప్రభుత్వం నేటితో సమాప్తమయింది. ప్రధాని చిఫ్లే గవర్నర్ జనరల్‌కు తన ప్రభుత్వపు రాజీనామాను అందజేశాడు. కొత్త ప్రభుత్వం ఏర్పడే వరకూ పిరిపే పరిపాలన జరపమని గవర్నర్ జనరల్ కోరవచ్చును.

## సమిష్టి సహకార వ్యవసాయానికి ప్రోత్సాహం

(1-వ పేజీ తరువాయి)

వ్యవసాయాభివృద్ధి జరగడం కష్టమనీ కూడా ఈ నిపుణులు అన్నారు.

ఢిల్లీలో జరిగిన రాష్ట్ర వ్యవసాయ కార్యదర్శుల సభలో ఒక మనిషికి ఇంతింతకే భూమి ఉండాలి అనే నియమం ... అభిప్రాయపడ్డారట.

... సహకార సంఘాలు ... వ్యవసాయిక బుణాలు, వ్యవసాయిక పనిముట్లు మొదలైనవి కూడా ఇవ్వాలనీ, ఈ సంఘాలకు ... ఆదాయం వచ్చేటట్లు కూడా చూడాలనీ పై వ్యవసాయిక సమావేశంలో సూచించారట.

భారతవ్యవసాయిక, మంత్రివర్గ సహకార సాముదాయిక వ్యవసాయ పద్ధతులను ప్రోత్సహించవలెనని ఆలోచిస్తున్నదట. దేశంలో లభ్యమయ్యే ట్రాక్టర్లను సాముదాయిక వ్యవసాయానికి ఉపయోగించవచ్చునని కూడా భారతప్రభుత్వం అభిప్రాయం పడుతున్నదట. అయితే మరకప్పు రేటు తగ్గింపునల్ల ఈ ట్రాక్టర్లు సంపాదించడం చాలా కష్టంగా ఉన్నదట. ప్రపంచ బ్యాంకుఋణం ద్వారావచ్చిన ట్రాక్టర్లను, రాష్ట్రాలలో సాముదాయికంగా సాగుచేసే భూములకే వాడాలనికూడా భారతప్రభుత్వం నిశ్చయించిందని తెలుస్తున్నది.

అందుచేతనే బొంబాయి ప్రభుత్వం ఈ ట్రాక్టరులు కావాలని అడిగితే ఇవి ప్రత్యేక ప్రయోజనాలకోసం ఉద్దేశింపబడ్డాయని చెప్పి భారత ప్రభుత్వం ఇవ్వడానికి నిరాకరించిందట.

కాంగ్రెసు వ్యవసాయిక సంస్కరణ సంఘం రాష్ట్రాలలో భూమికి సంబంధించిన కమిషనులుండాలనీ, వీటిని పర్యవేక్షించడానికి కేంద్రంలో ఒక ప్రత్యేక సంఘం ఉండాలనీ సూచించిందట. ఈ సంఘంలో పల్లెలలో ఎంతెంత భూమి వ్యవసాయం చేస్తే ఆర్థికంగా లాభసాటి కాగలదో నిర్ణయిస్తారని తెలుస్తున్నది.

భూమిసారాన్ని అనుసరించి, ఎంతెంత భూమి ఆర్థికంగా లాభసాటి కాగలదో నిర్ణయించడానికి వీలవుతుంది. ఒక రైతు వ్యవసాయం ఆర్థికంగా లాభసాటి కానప్పుడు అది సహకారపద్ధతుల మీద నడవాలని వ్యవసాయ సంఘం అభిప్రాయపడినదట.

ప్రతిపల్లెలోను సహకార వ్యవసాయానికి తగిన సంఘం ఏర్పడాలనీ, ఒకవ్యక్తికి పరిమితంగానే భూమి ఉండాలనే నియమం మంచిదికాదనీ, భూస్వాములు వ్యక్తిగతం వ్యవసాయం చెయ్యదలుచుకుంటే వారికి యంత్రాలు మొదలయిన అవకాశాలు కల్పించాలనీకూడా వ్యవసాయ సంస్కరణ సంఘం అభిప్రాయపడినదట. ఢిల్లీలో జరిగిన సమావేశంలో 1949-50-51-52 సంవత్సరాలలో ఆయారాష్ట్రాలు ఉత్పత్తి చెయ్యవలసిన ఆహారధాన్యాల గరిష్ఠ ప్రమాణాలుకూడా నిర్ణయించారట.

ఇంకా బంజరు భూములు తప్పకుండా దున్నించాలనీ, మునిసిపాలిటీల చేత తప్పకుండా ఎరువులు తయారు చేయించాలనీకూడా ఈ సమావేశంలో తీర్మానించారట.

ఆదివారంనాడు ఈ సమావేశంలో సూచించిన విషయాలనుగురించి చర్చించడానికి బొంబాయి వ్యవసాయాధికారులు పూనాలో ఒక సమావేశం జరిపారనీ దానికి బొంబాయి వ్యవసాయమంత్రి అధ్యక్షత వహించారనీ తెలుస్తున్నది.

## జెరూసెలంకు ఇజ్రాయిల్ రాజధానిమార్పు

(1 వ పేజీ తరువాయి)

జెరూసలేమ్‌పై ఇజ్రాయిల్ అధిపత్యాన్ని నెలకొల్పడానికి తాముకూడా సంపూర్ణంగా సహకరిస్తామని ప్రతిపక్షంలో వామపక్ష సభ్యులు ప్రకటించారు.

అయితే జెరూసలేమ్‌ను ఇస్రాయిల్ రాజధానిగా ప్రకటించడంమాత్రం జరగలేదు. పార్లమెంటును టెల్ అవీవ్ నుంచి జెరూసలేమ్‌కు మార్చడం డిసెంబరు 26 న జరుగుతుంది. ఆ తరవాత క్రమంగా మిగిలిన ప్రభుత్వశాఖలన్నీ కూడా జెరూసలేమ్‌కు వెళ్లిపోతాయి.

జోర్డనుకుగాని, ఐక్యరాజ్యసమితికి గాని, వ్యతిరేకించే తీవ్రచర్య లేవీ తీసుకోవద్దని ఆ టెల్ ఎవీవ్‌లోని అమెరికా రాయబారి, జేమ్సు మెక్డొనాల్డ్ సలహా యిచ్చాడట. ఆ తరవాతనే ఇస్రాయిల్ ఈ చర్య తీసుకున్నదని అభిజ్ఞులు అంటున్నారు. అమెరికా రాయబారి సలహావల్లనే జెరూసలేమ్‌ను ఇజ్రాయిల్ రాజధానిగా ప్రకటించడం కూడా జరగలేదట.

## ఎరిట్రియాలో తీవ్రపరిస్థితి

### ఇటాలియన్లపై ఎరిట్రియన్ల తిరుగుబాటు

అస్మారా, (ఎరిట్రియా) డిసెం 13: నేటిరాత్రినుండి ఇక్కడ బ్రిటిషు అధికారులు పొద్దుకూకింది లగాయతు కర్ఫ్యూ ... విధించారు ... సాగించేటి ... వచ్చినది.

ఇటాలియను, ఎరిట్రియను పత్రికలన్నీ నిలుపుచేయబడినవి. ఎరిట్రియనులు చేతిబాంబులతోనూ, రివాల్వరుతోనూ తాత్తిగా హత్యలకు దిగడంచూసి ఇటాలియను ప్రజలు భయభ్రాంతులవుతున్నారని తెలుస్తున్నది. నిన్నరాత్రి వీధిలో రివాల్వరుతో కాల్చబడిన ఇటాలియన్ డాక్టరు నేడు మరణించాడు.

అసలే తీవ్రంగావున్న పరిస్థితి ప్రచారంమూలంగా మరింత తీవ్రంకాకుండా బ్రిటిషు పోలీసులు కర్ఫ్యూ అమలుచేశారట. గతరాత్రి బ్రిటిషు ఇన్‌ఫర్మేషను కార్యాలయం ముందు ఎరిట్రియనులు ఆయుధ చేతిబాంబులు విసిరారు. కాని అవి పేలలేదు.

ఇండిపెండెన్సుబ్లాకు సభ్యులు ముగ్గురిపై రెండు చేతిబాంబులు విసరబడినవి.

ఇథియోపియాతో కలవాలని ఎరిట్రియనులకుగల కొంతకు ఆవాంతరాలు కలిగిస్తే చంపేస్తామని అస్మారాలోని ఇటాలియను పత్రికావిలేఖరులకు లేఖలు పంపబడినవి.

ఎరిట్రియాలోని తీవ్రపరిస్థితిగురించి తగుచర్యతీసుకోవలసినదని ఇటలీ విదేశమంత్రి కౌంట్ స్ఫోర్జా బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులను అర్థించారట.

## కరాచీవద్ద విమాన ప్రమాదం

(1-వ పేజీ తరువాయి)

భార్య, ఒక ఆరుపిల్లవు ఉన్నారు. రెండవ వారు బ్రిగేడియర్ జనరల్ షేర్‌ఖాన్. ఈయనకు ఈ మధ్యనే ఈ ఉద్యోగం వచ్చిందట. వీరుకాక ప్రమాదానికి గురిఅయినవారిలో ఇస్లామిక్ దేశాల ఆర్థిక సమావేశానికి వెళ్లుతున్న ఏడుగురు ప్రతినిధులు, ఇద్దరు ఆంగ్లేయులు, ఒక జర్మను దేశీయుడు, ఇద్దరు భారతీయులు కూడా ఉన్నారు.

వీరు లాలా మురళీధర్, ఆయనభార్య. లాలా మురళీధర్ లయాలాపూర్‌నించి, లాహోరుద్వారా కరాచీ వెడుతున్నారట. ఈయన ఒక పక్షంరోజుల పూర్వం ఢిల్లీనించి బయలుదేరారు. జనవరి 15వ తేదీకి లోపుగానే మళ్ళీ ఢిల్లీకి తిరిగి రావాలని అనుకుంటున్నారు. 16 వ తేదీ తరవాత ఈయన పెద్దకొడుకు వివాహమట.

ప్రమాదంజరిగిన తరవాత పరిశీలనార్థం విమానాలు వెళ్ళాయి. ఈ పరిశీలనవల్ల ఈ డకోటా పూర్తిగా ధ్వంసంచెందిపోయిందని తెలిసిందట. కొండలలో దుర్గమమైన ప్రదేశంలో విమానం కూలిపోయిందని, రక్షకదళాలు, విమానంలో ఉన్నవారిని రక్షించడానికి అప్పుడే బయలుదేరాయనీ తెలుస్తున్నది.

పాకిస్తాన్ ప్రభుత్వం ఒక ప్రకటనలో ఈ విషయాలన్నీ వివరిస్తూ ఈ ప్రమాదంపై విచారణసంఘం నియమించబడిందని ప్రకటించింది.

ఈ మరణించిన వారిలో ఇస్లామిక్ సమావేశం ప్రతినిధి అయిన ఒక ఈజిప్టుదేశీయుడు కూడా ఉన్నాడట. మేజర్ జనరల్ మహమ్మదు ఇఫ్తికార్ ఖాన్ ఆంగ్లదేశంలోని సుప్రసిద్ధ సైనిక కళాశాలలో సైనికవిషయాలు అవగాహన చేసుకోడానికి ప్రయాణం చేస్తున్నాడని తెలుస్తున్నది. పాకిస్తాన్ సైన్యంలో దీనికోసం ఈయన నేర్పట్టుకున్నదని తెలుస్తున్నది.

బ్రిగేడియర్ జనరల్ షేర్‌ఖాన్ భార్యతోకూడా న్యూయార్కు ప్రయాణమైనారు.

ఈయన భద్రతాసంఘంలో జరిగే కాశ్మీర చర్చసందర్భంలో న్యూయార్కు వెడుతున్నారనీ తెలుస్తున్నది.

కాశ్మీర ప్రభుత్వానికి చెందిన ఇద్దరు ఉద్యోగులుకూడా ఈ ఆపాయానికి గురిఅయినారట.

టర్కీరాయబార కార్యాలయాధికారి ఒకప్రకటన చేస్తూ ఇస్లామిక్ ఆర్థిక సమావేశానికి ప్రతినిధి అయిన టర్కీసభ్యుడుకూడా ఈ ప్రమాదంలో మరణించి ఉంటాడని అన్నారు.

విమానంలో ప్రమాదం జరిగిన ప్రదేశం బాగా పరిశీలించి తిరిగివచ్చిన పరిశీలకులు ఒక్కరెక్కతప్ప మిగిలిన విమానంఅంతా కాలిపోయిందని చెప్పారట.

ఢిల్లీ బట్టల మిల్లులకు చెందిన ముస్తఫాఅధికారులుకూడా ప్రమాదానికి లోనైనారని లాహోరునించి ఒక వార్త వచ్చినదని తెలుస్తున్నది.

## భారత రిపబ్లిక్ పరిగణన చట్టం

### లార్డ్స్ సభ ఆమోదం

లండన్, డిసెంబర్ 13: ఈ వేళ ప్రభువుల సభలో ఇండియాకు సంబంధించిన చట్టం ఒకటి ఆమోదించారు. దీనికి ప్రాతికూల్యం ఏమీ రాలేదు. ఇండియారిపబ్లిక్ కావాలని నిశ్చయించుకోవడంవల్ల ఏర్పడిన పరిణామం ... ఈ చట్టం ప్రవేశపెట్టవలసి వచ్చింది.

కామన్సుసభ ఇంతకుపూర్వమే దీనిని ఆమోదించింది. ఇది చట్టం కావడానికి ఇక ఆంగ్ల రాజు సంతకమే మిగిలాయి.

### బెవిన్ ఢిల్లీ రాకపోవచ్చు

లండన్, డిసెంబరు 13: భారత రిపబ్లిక్ అవతరణోత్సవ సమయంలో బ్రిటిష్ విదేశాంగమంత్రి, ఎర్నెస్ట్ బెవిన్ ఢిల్లీ వెళ్లడం సంభవించక పోవచ్చునని, విదేశాంగ కార్యాలయోద్యోగి యివాళ అన్నాడు. విమానంలో మరి ప్రయాణం చేయవద్దని డాక్టర్లు బెవిన్‌కు సలహా యిచ్చారు. అందువల్లనే ఆయన సింహళంలో జరిగే విదేశాంగమంత్రుల సభకు, డిసెంబరు 27 న బయలుదేరి అంచె లంచెలపై ప్రయాణం సాగిస్తూ జనవరి 7 వ తేదీకో లేక 8 వ తేదీకో కొలంబో చేరుకుంటాడు. రైలులో ప్రయాణంచేసి 28 సాయంకాలానికిరోం చేరుకుంటాడు 29 ఉదయం విమానంలో బయలుదేరి నీడో ఒక ఈజిప్టియన్ రేవులో దిగి అక్కడనుంచి 'కెన్యా' నౌకలో ప్రయాణంచేసి జనవరి 7, 8 తేదీలలో కొలంబో చేరుకుంటాడు.

జనవరి 16 వ విదేశాంగ మంత్రులసభ ముగియగానే బ్రిటిష్ యుద్ధనౌకలో తిరుగు ప్రయాణం సాగిస్తాడు.

## మారిషస్ దీవులకు చెందిన 40 మంది భారతీయుల రాక

కలకత్తా, డిసెంబర్ 13: భారత రిపబ్లిక్ అవతర ణోత్సవములలో పాల్గొనే నిమిత్తం, మారిషస్ దీవులనుండి, 40 మంది భారతీయులు నిన్న యిక్కడికి వచ్చారు. తమ తాత ముత్తాతలు, నూరేండ్ల క్రితమో, అంతకుముందో వదలివెళ్ళిన మాతృభూమిపై వీరు కాలుపెట్టడం యిదే ప్రథమం. వీరిపూర్వులు జన్మస్థలంవదలి, వేలాదిమైళ్ళ దూరంలోవున్న యీ దీవులకు, వ్యవసాయ కూలీలుగా వెళ్ళారు. వీరిలోచాలామంది ఉన్నత స్థానాలను అందుకో గలిగారు.

జనవరి 26 వ తేదీన రిపబ్లిక్ ఉత్సవాలలో పాల్గొనే నిమిత్తం, 60 మంది ఢిల్లీవస్తారని, వీరుగాక దాక్షిణాత్యులు 152 మందికూడా ఢిల్లీకి బయలుదేరారని, వీరిప్పుడు కొలంబోలోదిగారని, త్వరలోనే మద్రాసు చేరుకుంటారని, నిన్న వచ్చిన 40 మందిలోఉన్న వార్తాపత్రిక విలేఖరి ఒకరన్నాడు.

### మారిషస్‌దీవులలో జాతివిద్వేషం

ఆఫ్రికాలోగాని, మరెక్కడైనాగాని ఉన్నట్టే, జాతివిద్వేషం మారిషస్ దీవులలోగూడా తీవ్రంగా ఉన్నదని, వలస రాజ్యాధికారుల దోపిడిగూడా ఎక్కువగానే ఉన్నదని, అయితే వీటన్నింటిని ప్రజాస్వామ్య పంథాలో ఎదుర్కొంటున్నామని, అయినా ప్రపంచమంతటా ఉన్న యీ అన్యాయాన్నెదుర్కొనడంలో పండిట్ నెహ్రూ నాయకత్వంకోసం ఎదురుచూస్తున్నామని యీయన అన్నాడు.

## దేవాలయ కమిటీల నియామకం

### మంత్రుల సమాలోచనలు

మదరాసు, డిసెంబరు 13: ఇరువదివేల రూపాయల ఆదాయము వచ్చే దేవాలయములకు కమిటీలను నియమించవలెననీ, ఆ కమిటీలకు హెచ్చు అధికారములు ఇవ్వవలెననీ నేడు సెక్రటేరియట్‌లో జరిగిన సమావేశమున నిర్ణయించిరి.

ప్రధాని కుమారస్వామిరాజా, న్యాయమంత్రి శ్రీ మాధవమీనన్, దేవాదాయముల మంత్రి డా॥ రాజన్, మాజీ ప్రధాని ఓ. పి. రామస్వామిరెడ్డియార్ ధర్మాదాయములబోర్డు అధ్యక్షులు సమావేశమై ఈ విషయమును చర్చించిపై నిర్ణయము చేసిరి. ధర్మాదాయములబోర్డు నేటిమధ్యాహ్నం సమావేశమై ఈయంశమునుచర్చించగలదు.

## "నవసాహితి" అభ్యుదయ సంఘ ప్రారంభం

మదరాసు, డిసెంబరు 13: అభ్యుదయ రచయితలు, చిత్రకారుల సంఘము 'నవసాహితి' అనే వ్యవస్థ ఆదివారం సాయంత్రం మ్యూజియం థియేటర్లో ప్రారంభమయ్యెను. శ్రీ చిత్తూరు నాగయ్యగారు అధ్యక్షత వహించిరి. శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ మానవుని భవిష్యత్ నిర్మాణములో రచయితలు, చిత్రకారులపాత్రను గురించి ఉపన్యసించిరి.

## జనవరి 26 కే ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు

(1-వ పేజీ తరువాయి)

యాలను గూడా వారికి పంపుతున్నాను.

ప్ర:-క్రిందటిసారి విభజన సంఘంలో 5 గురు మంత్రులు ఉన్నారు. వి.గతా వారు ముగ్గురు జనవరి 26 కు రాష్ట్రం రావాలనుకున్నా సాధ్యం కాదన్నారే ఇప్పుడు మీ అభిప్రాయం మారిందా? వారిని పై చెయ్యి అయినదా?

స:-విభజన సంఘంవారు మటుకు నేను ఉన్న అభిప్రాయాన్ని రేపు చూడ్చుకోవచ్చు. మంత్రివర్గంకూడా అంతే విభజన సంఘంవారి అభిప్రాయం ఇది అని తెలిపాముగాని మద్రాసు ప్రభుత్వం దానికి జతచేసి మరేమీ పంపలేదు.

ప్ర: కేంద్రప్రభుత్వం మీకేమైన సమాధానం వ్రాసిందా?

స: వ్రాసినట్లు పత్రికల్లో చూపటంగాని మాకింకా ఏమీ చేరలేదు. వారు లోటుఅంటున్న 6½ కోట్లు వార్ కమిషనుకు ప్రభుత్వంవారు సేకరించి ఇచ్చిన సమాచారం విభజన సంఘంవారు తృప్తికరంగా సమస్యలన్నీ పరిష్కారం చేసుకుని కూర్చుంటే వాన్ని అమలు చెయ్యడానికి మద్రాసు ప్రభుత్వానికి ఏమీ ఆక్షేపణ ఉండదు. రాష్ట్రనిర్మాణానికి విభజనసంఘ సభ్యులు ఒక ప్రణాళికను సూచిస్తే అవశ్యమూ దాన్ని మామటుకు మేము పాలిస్తాము.

ప్ర: వార్ కమిషనేరేగాక ఇప్పుడు గూడా లోటు రాష్ట్రమే నని మొన్న గోపాలరెడ్డిగారు అసెంబ్లీలో చెప్పి ఉన్నారే?

స: అందులో కేంద్రప్రభుత్వ గ్రాంటు చేర్చిఉండకపోవచ్చు. ఇన్‌కంటాక్సు, పాగాకుపన్ను ఆదాయ పరివారం అన్నీ చేర్చిఉండక పోవచ్చు. అవన్నీ లెక్కచూసుకుంటే అంతనష్టం ఉండక పోవచ్చు.

ప్ర: జనవరి 26 కు రాష్ట్ర నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నారా?

స: జనవరి 26 వ తేదీకి రాష్ట్రాన్ని నిర్మించడానికే సర్వయత్నాలు చేస్తున్నాము.

ప్ర: హైకోర్టు ప్రత్యేకం చేస్తారా? గవర్నరు సంగతి ఏమి?

స: గవర్నరు సంగతి వారు సూచించలేదు. హైకోర్టు ముఖ్యంగా వేరుగా వుండవచ్చు.

ప్ర: కర్నాటక సభ్యులు ఎవర్నీ విభజన సంఘంలో వెయ్యలేదన్న విమర్శలకు ఏమి చెబుతారు?

స: ఆంధ్రులు, ఆంధ్రేతరులను లెక్కన ప్రాతినిధ్యం ఇవ్వబడింది.

మాధవమీనన్ గార్ని కేరళ ప్రతినిధిగా అందు వెయ్యలేదు. నిజలింగప్ప గారు ధైర్యం ఉంటే వర్కింగు కమిటీలో జబ్బలాడి కర్నాటకరాష్ట్రం తెచ్చుకోవలెను గాని వారిని వీరిని విమర్శించి లాభంలేదు.

ప్ర: బళ్లారిలోని మిగతా ఆరు తాలూకాల సంగతి ఏమి చేసెదరు?

స: విభజన సంఘంవారు ఆ తాలూకాలకు చేరి వున్న ఆంధ్రరాష్ట్రంలోనే చేరవలెనని సూచించి ఉన్నారు. నిర్ణయం చేసే అధికారం కేంద్రప్రభుత్వానిదే.

## ఆర్థిక సంఘ చర్చలు

విభజనసంఘంవారునియమించిన ఆర్థిక సంఘంవారు మంగళవారం సమావేశమై ఆంధ్ర, ఆంధ్రేతర రాష్ట్రముల ఆదాయవ్యయములను, విభజన సూత్రములను చర్చించిరి. సమావేశమునకు ఎస్. వెంకటేశ్వరన్ ఐ. సి. ఎస్., టి. ఎన్. ఎస్. రాఘవన్ ఐ. సి. ఎస్., ఓ. పుల్లారెడ్డి ఐ. సి. ఎస్., వి. కె. రావు ఐ. సి. ఎస్. అకౌంటెంట్ జనరలు గారలు హాజరైరి. కమిటీవారు తిరిగి గురువారం సమావేశమగుదురు.

### సిబ్బంది ఉపసంఘం

సిబ్బంది పంపకమును గూర్చి చర్చించుటకు సిబ్బంది ఉపసంఘంవారు నేడు సమావేశమగుచున్నారు.

## కేంద్ర ప్రభుత్వం పట్టుదల

(1 వ పేజీ తరువాయి)

చుండుటచేత, ఆంధ్రరాష్ట్రానికి స్వల్పంగానైనా కేంద్రంనుండి ఆర్థిక సహాయం లభిస్తుందను కోడానికి ఎక్కడా ఆస్కారం లేదు. కాబట్టి ఆరంభంలోనే అప్పుల తోటి ఆదాయంలో లోటుతోటి నూతన రాష్ట్రాన్ని యేర్పాటు చేయడం క్షేమంకరమేనా అన్న విషయాన్ని, ఆర్థిక ప్రవీణులు బహుజాగ్రత్తగా పరిశీలించటం చాలా అవసరం. పరిస్థితులు యిలా ఉన్నా సరే ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పాటు చేసి తీరవలసిందేనని అంటే, రాష్ట్ర నిర్మాణ బాధ్యత యెవరో ఒకరు నెత్తిన వేసు కోనవలసిందే ఆ బాధ్యతను కేంద్ర ప్రభుత్వం నెత్తిన వేసుకోవడం 'ల్లి' అని యిక్కడి అధికార వర్గాలవారు ఖచ్చితంగా చెబుతున్నారు. విభజన సంఘం ఆయా ప్రాంతాల ఆదాయాన్ని ఆధారంగా తీసుకొని ... అప్పుల విభాగం పై సూత్ర ప్రాయంగా అంగీకారానికి రావడమే గాకుండా, ఇందులో కొత్త రాష్ట్రం వాటా ఎంత వున్నది, పుజాయింపుగా నైనా నిర్ధారణ గావాలి.

## బళ్లారిలోని ఆంధ్రేతర తాలూకాల సమస్య

కేంద్ర ప్రభుత్వం పెట్టుకున్న మరొక సమస్య బళ్లారిలో మిగిలే ఆరు తాలూకాల భవిష్యత్తు.

ఆంధ్రులు ఎక్కువగా ఉన్న ఆదోని, ఆలూరు రాయదుర్గం తాలూకాలు ఆంధ్ర రాష్ట్రంలో చేరిస్తే, బళ్లారిలో యింకా ఆరు తాలూకాలు మిగిలి ఉంటవి. ఈ ఆరు తాలూకాలను గూడా ప్రస్తుతానికి ఆంధ్ర రాష్ట్ర పరిపాలన క్రిందనే ఉంచి కర్ణాటక రాష్ట్రం యేర్పడ్డప్పుడు, వీటిని అందులో చేర్చవచ్చునని, విభజన సంఘాభిప్రాయమైనట్లు తెలుస్తున్నది. ఇలా చేయడం భాషా రాష్ట్ర నిర్మాణ సూత్రానికే విరుద్ధమని, యిక్కడి లాబీ వర్గాల అభిప్రాయం. జిల్లా పైకొత్తంగాని, జనాభాగాని లెక్కలోకి తీసుకోకుండా మూడు తాలూకాలకోసం జిల్లాను విభజించకుండా మొత్తం జిల్లాను ప్రత్యేకంగా ఉంచడం సబబని వీరికి సూచిస్తున్నారు.

మరొక సమస్యగూడా కేంద్ర ప్రభుత్వానికి చాలా ఆందోళన కల్గిస్తున్నది. అది ఒక్క ఆంధ్రరాష్ట్రంలోనే గాక, యావద్భారత దేశంలోనూ, శాంతి భద్రతల రక్షణ సమస్య. ఆంధ్రను మద్రాసు రాష్ట్రంనుంచి విభాగిస్తే, యే రాష్ట్ర ప్రభుత్వం పనిచేయదలచుకొనేది, ఉద్యోగస్తుల యథేచ్ఛా నిర్ణయానికి వదలబడి ఉంటుంది. ఆంధ్ర ఉద్యోగస్తుల సంఖ్య ఆట్టే లేదన్న సంగతి తెలిసిందే గనుక సీనియర్ ఉద్యోగస్తుల మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం క్రింద పనిచేయడానికే నిశ్చయించుకోవడం, జూనియర్ ఉద్యోగస్తులను, (కేవలం జన్మస్థలాన్ని బట్టి)—పెద్ద ఉద్యోగాలలోకి త్వరత్వరగా పంపడం జరిగేఅవకాశం ఉన్నది. ఆంధ్రదేశసరిహద్దు అనుకొన్న రెండు మూడు హైదరాబాద్ జిల్లాలలో యింకా కమ్యూనిస్టు ప్రమాదం నిర్మూలింపబడలేదన్న సంగతి అందరు ఎరిగినదే. సమర్థులైన అనుభవశాలులైన ఉద్యోగస్తులు లేకపోయినట్లయితే, కమ్యూనిస్టులు విధ్వంసక కార్యాలను ఆంధ్రాలో బహు వ్యాప్తంగా చేయుటకు, తమ కార్యాలయాన్ని అనువైన చోటికి మార్చుకోవడానికి అభ్యంతరమేమీ ఉండదు.

## భాషా రాష్ట్రాలు: కేంద్ర ప్రభుత్వ వైఖరి

కర్ణాటకరాష్ట్ర నిర్మాణానికి ఆందోళన అప్పుడే ప్రారంభమైంది; కేంద్ర, రాష్ట్రశాసన సభలలోనుండి నైదొలగుతామని బెదరిస్తు కర్ణాటక నాయకులు కేంద్ర ప్రభుత్వాన్ని వత్తిడి పెడుతున్నారు. ఈ బెదరింపులకు లొంగి, కర్ణాటక రాష్ట్ర నిర్మాణానికి కేంద్రప్రభుత్వం ఒప్పుకున్నదంటే, ఒక్క మైసూర్ మహారాజాను తొలగించడమేగాదు, కర్ణాటక రాష్ట్ర నిర్మాణమునకు పూర్తిగా వ్యతిరేకులైనవారిపై బలాత్కారంగా రాష్ట్రాన్ని రుద్దుటకు, కేంద్రప్రభుత్వం పూనుకోవలసి వస్తుంది. ఏ మైనప్పటికి, ప్రస్తుతం మైసూర్ సంస్థానాన్ని విభాగించడానికి సమ్మతించలేని పలుకుబడి గల ప్రజావర్గం ఒకటి ఉన్నది ఇంతేగాదు; కర్ణాటకరాష్ట్ర నిర్మాణానికి ఒప్పుకున్న వెంటనే, మహారాష్ట్ర ఆందోళనగూడా విజృంభిస్తుంది. ఉత్తరాన, మాస్టర్ తారాసింగ్, గురుముఖి (సిక్కు) రాష్ట్రం యేర్పాటు కావాలని యిదివరకే చెప్పాడు.

ఆర్థికంగా దేశము ఎదుర్కొంటున్న క్లిష్ట సమస్యల పరిష్కారంపై దృష్టి కేంద్రీకరించి సమర్థమైన చర్యలు తీసుకోవలసిన యీ సమయంలో, యీ భాషా రాష్ట్ర నిర్మాణాందోళన ఎక్కడికి దారితీస్తుందో దేశాన్నెక్కడికి నడుపుతుందోనని కేంద్ర ప్రభుత్వం చాలా వ్యథపడుతున్నది. కాబట్టి, ముఖ్యమైన ఆర్థిక సమస్య పరిష్కారావసరాన్ని విస్మరించి, స్వల్ప తగాదాలపై దేశదృష్టిని మరల్చేకంటే భాషారాష్ట్ర నిర్మాణ సంకల్పాన్ని వాయిదా వేయడం మంచిదనే అభిప్రాయం యిక్కడ లాబీవర్గాల్లో ప్రబలంగా వ్యక్తీకమౌతున్నది.

## డిసెంబరు 20 న కాంగ్రెస కార్యవర్గ చర్చ

న్యూఢిల్లీ, డిసెంబరు 13: ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతూ రాష్ట్ర శాసన సభలనుంచి కర్నాటక సభ్యుల రాజీనామాలను గురించి కాంగ్రెస్ కార్యవర్గం డిసెంబరు 20వ తేదీ సమావేశమై చర్చిస్తుందని తెలుస్తున్నది.

దివితాలూకా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సమావేశము చల్లపల్లి రహదారి బంగాళాలో యీనెల 15 తేదీ ఉదయం 10 గం జరుగును.

# ఖుదేరాంబోసుకు కంచువిగ్రహం

## ఆంగ్లేయునిపై బాంబు విసిరినప్రథమభారతీయుడు

బీహారు ప్రధాని ఆవిష్కరణోత్సవం

ముజఫర్‌పూర్, డిసెంబరు 12: ఈవేళ ఇక్కడ బీహారు ప్రధానమంత్రి శ్రీ కృష్ణసింహా షహీద్ ఖుదీరామ్‌బోస్ కాంస్య విగ్రహానికి ఆవిష్కరణ మహోత్సవం చేశారు.

ఖుదీరామ్‌బోస్ 1908లో మొట్టమొదట్నగా ఒక ఆంగ్లేయునిమీద బాంబు విసిరిన వాడు. ఈ ఆవిష్కరణోత్సవానికి (శ్రీ) వేలమంది హాజరైనారు.

అసలు ఖుదీరామ్ విసిరినబాంబు ఆరోజుల్లో రాజధాని న్యాయాధికారిగా ఉన్న కింగ్స్‌ఫోర్డును ఉద్దేశింపబడినది. కాని ఆబాంబు తప్పి ఆంగ్లోఇండియన్ న్యాయాధికారి భార్య కుమార్తెకూ తగిలింది. అతరవాత ఖుదీరామ్‌ను ఉరితీశారు.

ఈకంచు విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ బీహారు ప్రధానమంత్రి ఇల్లా అన్నారు. "స్వాతంత్ర్య సంపాదనలో భారతదేశం ఖుదీరామ్‌బోస్ మార్గం అనుసరించలేదు. అయితే మాతృదేశభక్తితో స్వార్థ త్యాగం చేసిన ఖుదీరామ్" భక్తిని గౌరవిస్తున్నది.

దేశభక్తి మహాపరాధంగా పరిగణింపబడినరోజుల్లో ఖుదీరామ్ ఉదయించాడు. ఆకాలంలో సాహసులయిన వంగయువకులనేకులు దేశస్వాతంత్ర్యం కోసం హింసాపూరితమైన చర్యలు చేశారు. అప్పుడు వారు తమ జీవితాలు ధారపోయ్యడానికి కూడా వెనకంజవెయ్యలేదు. ఇండియా రిపబ్లిక్ అవతరణలో ఇలాంటివారిని మనం గౌరవించాలి. వీరిని భావితరాల వారందరు అత్యధికంగా గౌరవిస్తారు.

# హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లు

## సనాతనుల ప్రతిఘటన

కాశీ, డిసెంబరు 12: హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లును వెంటనే ఉపసంహరించుకోవాలెనని కోరు తీర్మానము శ్రీకరపాత్రిస్వామి అధ్యక్షతను జరిగిన పండితుల సభవారు నేడు గావించిరి. లౌకిక రాజ్యము అన్ని మతములవారిని సమముగా చూడవలెనని, ఎవ్వరి మత విషయముల లోను జోక్యము కలిగించుకొనగూడదని తీర్మానము తెలిపెను.

గోవర్ధన పీఠాధిపతులగు శ్రీ శంకరాచార్యులవారు, శ్రీమతి ప్రభావతీదేవి (దేవాస్ మహారాజాగారి కుమార్తె) ఇంకా చాలామంది పండితులు ఉపన్యసించుచు ప్రస్తుత రాజ్యాంగ పరిషత్ సభ్యులకు మత విషయములపై అభిప్రాయము చెప్పు యోగ్యత లేదనిరి. రాజకీయ వ్యవహారములను నిర్వర్తించుటకు ప్రజలు వారిని ఎన్నుకొనిరనిరి. ప్రభుత్వమువారు బిల్లును ఉపసంహరించుకొనవలెనని కోరిరి.

# 'పాకిస్తాన్ దౌష్ట్యాన్ని కమిషన్ నివేదికవ్యక్తంచేస్తున్నది'

## షేక్ అబ్దుల్లా అభిభాషణ

బొంబాయి, డిసెంబరు 13:- లేక్‌సక్సెస్ నుండి వెడుతూ ఇక్కడ కొన్ని గంటలు గడిపిన కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లా, కాశ్మీరు కమిషనువారి నివేదికను గురించి మాట్లాడుతూ భారత ప్రధాని వైఖరే తన వైఖరి అని చెప్పారు. కాశ్మీరు వివాదాన్ని సమ్మతిగా పరిష్కరించడానికిగాను భద్రతాసంఘంవారు మధ్యవర్తిని నియమించడం ఇండియాకు అమోదకరమని గిరిజాశంకర బాజ్‌పాయి చెప్పిన మాటతో షేక్ అబ్దుల్లా ఏకీభవించారు. (నెహ్రూ) తన అమెరికా పర్యటనలో కాశ్మీరు సమస్యను గురించి తన భావాలను విస్పష్టం చేశారనీ ఓర్పుతో ఉన్నట్లయితే సత్యం జయిస్తుందనీ నిరాశ చెందవలసిన కారణం లేదనీ ఆయన అన్నారు.

కాశ్మీరుపైదాడిలో పాకిస్తాను వహించిన దుష్టపాత్రను కమిషను రిపోర్టుబాగా

### తుపాన్ నష్టప్రాంతాల్లో శిస్తు రిమిషన్

#### ప్రభుత్వ వివరణ

మదరాసు, డిసెంబరు 13: నీటితీరువ లేకుండా మొట్టశిస్తు మాత్రమే వున్న వారికి శిస్తు రిమిషన్ వర్తించదని ప్రభుత్వము ప్రకటించుచున్నది.

విస్పష్టంచేసిందనీ, పాకిస్తాను సైన్యాలు కాశ్మీరు పరిహద్దులో ఉన్నట్లు రుజావు చేసిందనీ షేక్ అబ్దుల్లా అన్నారు.

కిందటిసారి షేక్ అబ్దుల్లా లేక్‌సక్సెస్‌కు వెళ్లినప్పుడు అక్కడి ప్రజలకు కాశ్మీరు భౌగోళికంగా ఎటువంటి ప్రదేశంలో ఉన్నదీ తెలియదు ఇప్పుడావిషయం అందరికీ తెలుసు. కాశ్మీరు వ్యవహారంలో కాశ్మీరుసేనలకు ఎట్టి సంబంధమూ లేదని కిందటిసారి సర్ మహమ్మదు జఫ్రుల్లాఖాను వాదించారు ఈ విషయంలో నిజం ఏమిటో కమిషను నివేదిక తెలిపింది.

మధ్యవర్తిత్వం గురించి ఇండియావైఖరి విస్పష్టం చేయబడింది. ఈసారిభద్రతా మండలివారు మధ్యవర్తి నియామకానికి సంబంధించిన సూత్రాలనుసరించి, మధ్యవర్తి అధికారాలనుగురించిచర్చించవచ్చు.

యుద్ధమూ, పరిష్కర్తృత్వమూ అమోదకరం కానప్పుడు మధ్యవర్తిత్వమే మిగులుతుందనీ, ఈసారి మధ్యవర్తిత్వం విజయవంతం కావచ్చుననీ షేక్ అబ్దుల్లా అన్నారు.

సాయంకాలం 8 గంటలకు షేక్ అబ్దుల్లా విమానంపై లండనుకు బయలుదేరారు. ఆయన విమానం శనివారం రాత్రి కైరోచేరి ది లండనునుంచి ఆయన న్యూయార్కు వెళ్ళతారు.

# విదేశాల్లో అమెరికన్ పెట్టుబడులు

## ప్రత్యేక రక్షణలు కావాలని మెఘీ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 13: "విదేశాల్లో పెట్టుబడి పెట్టవలసిన కొందర అమెరికన్ ధనస్వాములకు లేదు. తమ దేశంలోనే పెట్టుబడి పెట్టటానికి వారికెంతో అవకాశాలు ఉన్నవి. ఇతరదేశాల్లో పరిస్థితులు అనుకూలంగా ఉంటేనే వారక్కడ పెట్టుబడి పెట్టగలరు. తమ పట్ల విచక్షణ చూపబడదనీ, విప్లవం, బలాత్కారంగా అపహరించటం మొదలైన వాటినుంచి రక్షణ ఉన్నదనీ నమ్మకం కలిగినప్పుడు వీరు విదేశాల్లో పెట్టుబడిపెడతారు. అని అమెరికన్ విదేశాంగ శాఖ ఉపమంత్రి జార్జి మెఘీ నేడిక్కడ పత్రికావిలేఖరుల గోష్ఠిలో వెల్లడించాడు.

విదేశాలలో పెట్టుబడులు పెట్టే విషయమై నిర్ణయించేది పెట్టుబడిదారులేకాని అమెరికా ప్రభుత్వం కాదని ఆయన అన్నాడు.

"పెట్టుబడిదారులు ముందుకు రాకపోతే అమెరికా ప్రభుత్వమే పెట్టుబడి పెడుతుందా?" అని ఒక విలేఖరి ప్రశ్నించగా మెఘీ ఈ కింది జవాబిచ్చాడు. "అటువంటి పరిస్థితుల్లో ప్రభుత్వ స్థాయిలో సహాయం చేసే విషయమై అమెరికా ఆలోచిస్తుంది. అయినా పరిస్థితులు అనుకూలంగా ఉంటే పెట్టుబడిదారులే ముందుకి వస్తారు."

### ట్రూమన్ సహాయం

"ప్రెసిడెంట్ ట్రూమన్ వెనుకపడ్డ దేశాలకు సహాయం చేయటానికి ఏర్పరచిన పథకం వల్ల ఇండియాకు తన నిర్మాణ పథకాలకు కావలసిన అమెరికన్ పెట్టుబడి, టెక్నికల్ సహాయం లభిస్తుంది. ఈ సహాయాన్ని తాను ఆహ్వానిస్తున్నానని పండిత నెహ్రూ తన అమెరికా పర్యటనలో వెల్లడించాడు." అని అతడు తెలియజేశాడు.

### ఇండియా - అమెరికా వాణిజ్య ఒడంబడిక

ఇండియా, అమెరికాల మధ్య ఒక వాణిజ్య ఒడంబడికను చేసుకునే విషయమై సంప్రదింపులు జరుగుతున్నవని అతడు వెల్లడించాడు.

### అమెరికా విదేశాంగ నీతి

బర్మాకు కానీ, మరే ఇతర దేశానికి కానీ సైనిక సహాయం చేసే విషయమై అమెరికా ప్రస్తుతం ఆలోచించటం లేదని మెఘీ ఒక ప్రశ్నకు జవాబిస్తూ తెలియజేశాడు.

పాకిస్తాన్ ప్రధానిని మినహా మరే ఇతర దేశపు ప్రధానినీ ఆహ్వానించాలని అమెరికా ప్రభుత్వం అనుకోటం లేదని అతడు వెల్లడించాడు.

కమ్యూనిస్టు చైనాను అమెరికా గుర్తించే విషయమై అడిగిన ప్రశ్నలన్నిటికీ 'అది నా హోదాకుమించిన వ్యవహారం' అని చెప్పి తప్పుకొన్నాడు.

# "కాశ్మీర్ కమిషన్ నివేదికఇండియావాదాన్ని సరిగా ప్రతిబింబించింది"

## ఢిల్లీ రాజకీయ వర్గాల అభిప్రాయాలు

న్యూఢిల్లీ, డిసెంబరు 13: కాశ్మీరు కమిషనువారి నివేదిక నేడు ఇండియా ప్రభుత్వానికి అందింది. భద్రతామండలికి కాశ్మీర్ కమిషనువారు చేసిన సూచనలపై అధికార వ్యాఖ్యానాలేవీ ఇంకా వెలువడలేదు. అయితే, అజాద్ కాశ్మీరు సేన లసేకతో 32 దళాల పాయుధ సేనలున్నవని ఇండియా అన్నమాటను కాశ్మీరు కమిషను నివేదిక రూఢిపరచిందని అభిజ్ఞులు చెప్తారు.

నివేదికలోని రెండు అంశాలు ప్రాముఖ్యంగలవిగా భావించబడుతున్నవి: (1) కాశ్మీరును నిస్సైనికంచేసే విషయంలో ఇతర వ్యత్యాసాలన్నిటినీ కట్టిపెట్టి ఈ సమస్యను ఉమ్మడిగా పరిష్కరించాలని కమిషనువారు సూచించడం; (2) ఇండియా పాకిస్తానుల సేనలను మాత్రమే దృష్టిలో వుంచుకొని ఏర్పరచిన కార్యక్రమాన్ని అనుసరించి ఇండియా తన బలాలను ఉపసంహరించజాలదని కమిషనువారు గుర్తించడం.

కాశ్మీరు ఉత్తర ప్రాంతంనుంచి పాకిస్తానుసేనలు వైదొలగగానే ఆ ప్రాంతాల పరిపాలనా బాధ్యత కాశ్మీరుప్రభుత్వానికీ, రక్షణబాధ్యత భారతీయ సైన్యాలకూ సంక్రమిస్తుందని ఇండియా చేసినవాదాన్ని కాశ్మీరు కమిషనువారు కాదనలేదు. కాని, ఈ ప్రాంతాలలోకి భారతీయసైన్యాలు అడుగుపెడితే యుద్ధం తథ్యమని కమిషను

వారు నివేదికలో సూచించడం పాకిస్తాను దురాక్రమణను సహించడమవుతుందని ఇక్కడి అభిజ్ఞులంటున్నారు.

మధ్యవర్తిని నియమించాలని కమిషనువారు చేసిన సూచన అమోదకరమే గాని భద్రతామండలివారు కాశ్మీరుకు పంపే మధ్యవర్తియొక్క అధికారాలనుగురించి చేయబడిన సూచనలు అస్పష్టంగావున్నవి. మధ్యవర్తిగా వచ్చే మనిషికి అన్నిరకాల పరిష్కారమార్గాలూ అన్వేషించడానికి సంపూర్ణాధికారం వుండాలిగాని అతని అధికారాలను పరిమితంచరాదు, అని ఇవేళ భారత ప్రధాని పత్రికావిలేఖరులగోష్ఠిలో తెలిపివున్నారు. అయితే అజాద్ సేనల ఉపసంహరణ ఎట్టి పరిస్థితిలోనూ జరిగి తీరవలసిందేగాని అది మధ్యవర్తి పరిష్కారానికి వదలబడదనికూడా ప్రధాని ఉద్ఘాటించివున్నారు.

"కాశ్మీరులో జనవాక్యనిర్ధారణ సాధ్యం కావడానికిగాను కాశ్మీరు జమ్మూసంస్థానం నిస్సైనికంచేయడం విషయమై అపరిష్కృతంగా నిలచిపోయే వ్యత్యాసాల సందర్భంలో చివరకు పంచాయితీ జరగవలసివుంటుంది" అని కమిషనువారు చేసిన సూచనను ఇంకా విపులీకరించడం అవసరం కావచ్చునని కూడా ఇక్కడి అభిజ్ఞులు భావిస్తున్నారు.

# రాజమండ్రి పండిత పరిషత్తు వార్షికసభ

కావలి, డిసెంబరు 11: రాష్ట్రీయోపాధ్యాయ పండిత పరిషదుపసంఘము రాజమండ్రి శాఖయొక్క వార్షికోత్సవము రాజమండ్రిలో గత మంగళవారంనాడు మల్లంపల్లి నారాయణమూర్తిగారి అగ్రాసనాధిపత్యముక్రింద జరిగినది. క్రొత్త సంవత్సరమునకు సాగి సత్యనారాయణగారు అధ్యక్షులుగను, కలగ వెంకటసోమయాజులుగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి. ఒంగోలులో జరుగనున్న 18వ మహాసభకు సాగి సత్యనారాయణ పిసపాటి వెంకటేశ్వర్లు, యనమూరి మల్లికార్జునరావు, చిలుకూరి విశ్వనాథశాస్త్రిగారలు ప్రతినిధులుగా ఎన్నుకొనబడిరి. 15 సంll సర్వీసుతో నిమిత్తములేకనే సీనియరు పండితులకు యల్. టి. స్కేలు నీయవలెననియు, 1947 జనవరి నాటికి సర్వీసులోనున్న జూనియరు పండితులకు యోగ్యతలతో నిమిత్తములేకనే సీనియరు ఖాళీలు వచ్చినప్పుడు 60-4-120 స్కేలు నీయవలెననియు, తీర్మానములు కావింపబడెను.

ఆంధ్రరాష్ట్ర ఆయుర్వేద విద్యార్థి కాంగ్రెసు చతుర్థ మహాసభలు గుంటూరు శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాలయందు యీనెల 17, 18 తేదీలలో డా॥ కాసలనాటి ఆంజనేయశర్మగారి అధ్యక్షతన జరుగును

# హిందూ ధర్మ శాస్త్రక్రోడీకరణ బిల్లుపై ప్రజాభిప్రాయ సేకరణ అవసరమని రాష్ట్రపతి డా॥ పట్టాభి

న్యూఢిల్లీ, డిసెంబరు 13: ప్రజల అభిప్రాయాన్ని సేకరించకుండా హిందూ ధర్మ క్రోడీకరణంబిల్లును చట్టంచేసేందుకు వీలు లేదని కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేడు పార్లమెంటులో ఉద్ఘాటించారు.

"బిల్లులో చాలా అంశాలు నాకు నచ్చినవి వున్నాయి. అయినా ఈ బిల్లుమీద ప్రజల అభిప్రాయాన్ని తీసుకొని, వాళ్ల అనుమతి ప్రకారమే నడవడం నాయిష్టం," అనిఆయ స్పష్టంగా ప్రకటించారు.

ఈ బిల్లుమీద ప్రసంగిస్తూ ఆయన ప్రభుత్వానికి ఒక హెచ్చరికగూడా చేశారు. ఈ బిల్లు విషయంలో మీరు జాగ్రత్తగా నడవకపోయినట్లయితే, వచ్చే ఎన్నికల్లో కాంగ్రెసు దెబ్బతింటుంది అని డాక్టరుగారు హెచ్చరించారు.

నిన్నటిరోజున పార్లమెంటు భవనం ముందు జరిగిన వ్యతిరేక ప్రదర్శనాలు, లాఠీచార్జి వీటినిగురించి మాట్లాడుతూ, ఇవ్వాళ్టిరోజున క్షేత్రపుల స్థానంలో మగ్గురు ఆడ పోలీసులు కనపడుతున్నారు. ఇంతకన్న విచారించవలసిన విషయం ఇంకోటిలేదు. నిజానికి ప్రభుత్వం ప్రజాభిమతం ఏమిటో గ్రహిస్తే, వీరు ఇక్కడ కూర్చోవలసిన అవసరంలేదు అని రాష్ట్రపతి అన్నారు.

సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ బిల్లులో కొన్ని అంశాలను బలపరిచారు. కొన్ని అంశాలను విమర్శించారు. ఆయన విమర్శించిన అంశాలు సమిష్టికుటుంబానికీ, ఆస్తివిషయంలో స్త్రీల హక్కులకు సంబంధించినవి.

బిల్లులో వివాదాస్పదములుకాని అంశాలను ముందు చట్టరూపంలో ఆచరణలోకి తెచ్చి, తక్కిన వాటిని ప్రజాభిమతానికి వదలవలసిందిగా ఆయన సూచించారు.

దర్భాంగా మహారాజా అసలు బిల్లును మొత్తంగానే తూర్పారబట్టారు. బీహారులో ప్రజాభిప్రాయం ఈ బిల్లుకు పూర్తిగా వ్యతిరేకంగా వున్నదని ఆయన అన్నారు.

డా॥ పి. కె. సేన్ బిల్లును బలపరిచారు. ఆయన పూర్వం పాట్నా హైకోర్టులో జడ్జిగా పనిచేశారు. సమిష్టి కుటుంబాలను నాశనం చేస్తుందన్న విమర్శకు ప్రత్యుత్తరమిస్తూ సమిష్టి కుటుంబ వ్యవస్థను రక్షించడం ఎంతోకాలం సాధ్యం కాదు. అది రోజురోజుకు క్షీణించిపోతున్నది. పూర్వం అది చాలా గొప్పదిగా వుండి వుండవచ్చును. కాని ఇప్పుడు అది చాలా అప్రతిష్టపాలై పోతున్నది అని ఆయన అన్నారు.

స్త్రీలకు ఆస్తిలో భాగస్వామ్యం పనికిరాదనేవాళ్లను తాతలనాటి తలకాయలు వర్ణించారు. అప్పుడు స్త్రీ అంటేవాళ్ళకు వున్న న్యూనభావమే ఇప్పుడు గూడా వీరిని పట్టుకు పీడిస్తున్నదని డా॥ పి. కె. సేన్ అన్నారు.

శ్రీమతి కమలాచౌదరి బిల్లును సమర్థిస్తూ, భారత మహిళాలోకం, డా॥అంబేద్కర్ ఇటువంటిబిల్లును తెచ్చినందుకు ఆయనను తరతరాలుగా జ్ఞాపకం చేసుకుంటూ వుంటుందని అన్నది. ఈ బిల్లు హిందూసభ్యతకు, హిందూమతానికి వ్యతిరేకంఅని అన్నవారిని విమర్శిస్తూ, ఇది హిందూ ధర్మానికిగాని, సంస్కృతికిగాని ఎంతమాత్రం విరుద్ధం కాదని ఆమె స్పష్టం చేసింది. స్త్రీలను అజ్ఞానులనుచేసి, వారిని మరిసిద్ధాము సేద్యపు ప్రతిపక్షులలో భాగా వున్నట్లు కనిపిస్తున్నదని అదీకాకుండా ఈ బిల్లు ఏకపత్నీత్వాన్ని విధించడం వారికి నచ్చివుండక పోవచ్చునని ఆమెఅభిప్రాయపడ్డది.

ఆచార్య కృపలానీ బిల్లును సమర్థించారుగాని, అది సమర్థనయో విమర్శనయో సభ్యులకు అర్థంకాలేదు. ఆయన అదో విధంగామాట్లాడారు. ప్రభుత్వం ఈ బిల్లుపవిత్ర తన భవిష్యత్తుకు సంబంధం వున్నట్లు భావిస్తున్నది ఈ బిల్లునిమిత్తం వారు బయటకు రాకలసిన అవసరం వాకేమీకనిపించడంలేదు. అందువల్ల నేనీ బిల్లును సమర్థిస్తున్నాను అని ఆయన అన్నారు.

శ్రీ కృష్ణస్వామి భారతిచర్చను వాయిదా వేయవలసిందని, ఇంకో రోజు ఇందుకు కేటాయించవలసిందని ప్రధాని నెహ్రూను అర్థించారు. నెహ్రూ అందుకు అంగీకరిస్తూ, ఇంకో రోజులో దీనిమీద చర్చ పూర్తి కావాలని స్పష్టం చేశారు.

ఇవ్వాళ్ల తిరిగి ధర్మక్రోడీకరణం బిల్లుమీద పార్లమెంటు చర్చ బయట వ్యతిరేక ప్రదర్శనాలు లేకుండానే ప్రారంభమైంది. నేటి చర్చను వినడానికి ప్రేక్షకులు అమితంగా వచ్చారు వారిలో ఒక సాధువుకూడా వున్నాడు

నేటి చర్చలో మొదటగా సర్ అల్లాడి మాట్లాడారు. ఆయన అంబేద్కర్ ప్రతిపాదనలు బలపరిచారుగాని అందులో కొన్ని అంశాలను, ప్రత్యేకంగా సమిష్టి కుటుంబాలకు ఆస్తికి స్త్రీ వారసత్వానికి సంబంధించిన అంశాలను ఇంకా పరిష్కరించవలసిన అవసరం వున్నదని ఆయన సూచించారు. మనమంతా హిందువులం, అది మరిచిపోతామన్నా సాధ్యంకాదని అని ఆయన హెచ్చరించారు.

ఈ బిల్లుపట్ల దేశంలో అనేకజనం భొంగు కన్నీళ్ళు పెల్లడిస్తున్నారు. అందువల్ల మనం ప్రతిపక్షుల భావాలేమిటో తెలిసికొని, నెమ్మదిగా ఆలోచించి, ప్రజలమేలును పాటించి నిర్ణయత్వంతో ఒక నిర్ణయానికి రావలని వున్నదని స్పష్టమౌతున్నది అని ఆయన హెచ్చరించారు.

వివాహం విషయంలోను, విడాకుల విషయంలోను ఈ బిల్లు సరైన నిర్ణయాలు చేస్తున్నట్లు తనకు తోచడంలేదని ఆయన విమర్శించారు. మంత్రోక్తమైన వివాహాలను, రిజిష్టరు వివాహాలక్రిందకు మార్చాలంటే, అది కాలంమీద జరగవలసిన విషయం. అదీకాకుండా, కొన్ని చోట్ల ప్రబలంగావున్న ఆచారాలను ఈ బిల్లు గుర్తిస్తున్నది. ఏమైనా, వివాహ విషయంలో ఒక సమానధర్మాన్ని నిర్దేశిస్తూ, సమితుల మధ్య వివాహం సాధ్యపడకుండా చేయడం యోగ్యం. ప్రస్తుతం ఈ బిల్లు కాపిస్తున్న వైవాహికవిధి బాగుండలేదు అని ఆయన అన్నారు. విడాకుల విషయంలో గూడా ఈ బిల్లులోని అంశాలు అంత బాగుండలేదని, అది సుగమంగా వుండాలని ఈ బిల్లు అభిప్రాయమైతే, అందుకు అది విధిస్తున్న విధి విధానం వెక్కుబ్బుతో కూడిదిగా వున్నదని, నిజంగా విడాకులపద్ధతి మంచిదా అని ప్రభుత్వం భావించేపక్షంలో, దాన్ని బారంబారంగా పురుదేటట్లు చూడటం అవసరమని సర్ అల్లాడి అన్నారు.

సమిష్టి కుటుంబాల విషయంలో ఈ బిల్లు నిర్దేశిస్తున్న విధానంతో తాను ఏకీభవించలేనని సర్ అల్లాడి అన్నారు. సమిష్టి కుటుంబ వ్యవస్థ కొన్ని మంచి లక్షణాలు వున్నాయి. పిల్లలకు చదువు మొదలైన విషయాలలో ఈ పద్ధతి ఎంత బాగా పనిచేసేది నాకు తెలుసు. తమ తమ్ముళ్ళు చదువుకొని బాగుపడేనిమిత్తం పాటుపడు కాచుకొని వారికి చదువు చెప్పించిన అన్నలను నేను ఎరుగుదును. తన అన్న కొడుకుల అభివృద్ధికోసం పనుతున్న పిన తండ్రులను నేను ఎరుగుదును. ఏ వ్యవస్థ అయినా కల్పాంతం ప్రబలదన్న విషయం నాకు తెలియనది కూడా కాదు. అయినా ఇప్పుడు సమిష్టి కుటుంబ వ్యవస్థను రద్దు చేసే సమయం ఆసన్నమైనదా? అనే నా అనుమానం అని ఆయన ప్రశ్నించారు.

ఆస్తి విషయంలో స్త్రీకు వారసత్వం కల్పించడం విషయంలో తన అభిప్రాయాలను వెలువరుస్తూ, నాకు నలుగురు ఆడ పిల్లలు, ముగ్గురు మొగ పిల్లలు వున్నారు గనుక నేనీ విషయంలో కొంత అధికారంతో మాట్లాడగలనని అనుకుంటున్నానని ఆయన అన్నారు. హిందూ కుటుంబజీవనంలో ఆడబిడ్డలకు ఒక విశిష్ట స్థానంవుంది వందనకు వచ్చారిక వారు రావడం, పురుళ్లు పుణ్యాలు పుట్టినింట్లో జరుపుకొనడం ఇవన్నీ సంప్రదాయాలుగా వస్తున్నాయి. ఇప్పుడు అన్నలకు, తమ్ముళ్లకు, అక్కలకు చెల్లెళ్ళకు పోటీకిరావడం భావ్యం కాదనిపక్ష వారికివిన్నవించుకుంటున్నాను. దేశంలో ఆల్లరికంతకు ఆస్తి కారణ మూరున్నది. దాన్ని మరింత తీవ్రతరం చేయడం మన పని కాదు పెళ్లికాని ఆడపిల్లలకు, మగపిల్లలకు ఆస్తిలో సమాన హక్కులు ఇస్తూ, పెళ్లిఅయిన వారికి తల్లి ఆస్తిలో మాత్రమే భాగాన్ని పెట్టడం యోగ్యమైన మార్గంగా నాకు కనపడుతున్నది అని ఆయన అన్నారు.

స్త్రీ ధనం విషయంలో ఈ బిల్లు విధిస్తున్న అంశాలు బాగానే వున్నాయి. అంతమాత్రం చేత సమాజంలో వున్న సంప్రదాయాన్ని తిరక్కంతో నలిపివేద్దామని భావించడం గూడా మంచిది కాదు. ఒక స్త్రీ విధవ అయితే, ఆమె భాగం ఆస్తి, ఆమె తల్లిదండ్రులకు రావాలని అంటున్నారు. అది సబబుగా లేదు. అత్తగారింటి దండ్రులకు ఆ ఆస్తి పోతే వచ్చిన నష్టం ఏమిటి? ఇటువంటి విషయాలలో ప్రజాభిప్రాయం గ్రహించడం మంచిది. మూరపుమట్టాల విషయంలో ఈ బిల్లు చెబుతున్నదే బాగానే

వున్నది సభ్యుల విమర్శలకు న్యాయశాఖామంత్రి, ప్రధానిగూడా సావధానంగా వింటూ భావిస్తున్నాను. అని ఆయన తన ఉపన్యాసాన్ని ముగించారు.

వివాహం, విడాకుల విషయాలలో సర్ అల్లాడి అభిప్రాయాలతో తాను ఏకీభవించలేనని డా॥ పి. కె. సేన్ అన్నారు. వివాహం మంత్రయుక్తంగా జరిగినా సరే, దాన్ని రిజిష్టరు చేయించవలసిన అవసరం ఎంతైనా వున్నదని ఆయన అభిప్రాయపడ్డారు. లేకపోతే, ఇక్కడ ఇది జరగలేదు, అక్కడ అది జరగలేదు, కాబట్టి ఈ పెళ్లి పెళ్లికాదు అని అనసాహసించగల సావకాశం వుంటుందని ఆయన వాదించారు.

అదీ కాకుండా వివాహం, విడాకులు, విడిబంధాలు, ఈ విషయాలు ఖచ్చితంగా జరుగులు జరగాలని బిల్లులో ఎక్కడా లేదని, అది వారి వారి ఇష్టానికి వదిలివేయబడిందని డా॥ సేన్ అన్నారు. అంతేకాకుండా దేశంలో చాలామంది కులభేదం పోవాలంటున్నారు. ఏకపత్నీవ్రతం అవసరమంటున్నారు. అందువల్ల వాటిని ఇందులో చేర్చడం సబబే కాని, లేకబోవు ఎంతమాత్రం కాదని డా॥ సేన్ అన్నారు.

శాస్త్రోక్తిద్ధిన ధర్మాలను ముట్టుకోరదన్న వారికి జవాబిస్తూ, మనువు గూడా అట్లా అనలేదని, దేశకాల విహితములైన ఆచారాలను పాటించవలసిందిగా మనవు గూడా అన్నారని, అట్లా కాని పక్షంలో ఇన్ని స్మృతులు ఎట్లా వస్తాయని ఆయన ప్రశ్నించారు.

సమిష్టి కుటుంబాలను గూర్చి మాట్లాడుతూ, అవి నాశనమై పోతున్నాయని, అందువల్ల వాటిని పట్టుకు వేళ్ళాడటం భావ్యం కాదని డా॥ సేన్ సలహా ఇచ్చారు. స్త్రీలకు ఆస్తి విషయంలో వారసత్వాన్ని కల్పించడాన్ని రౌండ్ టేబుల్ సమావేశంద్వారా తేల్చవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు. ఈ బిల్లులో స్వల్పమైన లోపాలువుంటే వుండవచ్చును. వాటిని మనంఅంతా సావధానంగా ఆలోచించి పరిష్కరించ వచ్చును, మనకు కావలసింది అసలు ఈ బిల్లు సరిగ్గావున్నదా? లేదా? అన్నది. బిల్లు సరిగ్గానే వున్నది. అందువల్లనే నేను దీన్ని సమర్థిస్తున్నాను అని ఆయన అన్నారు.

డా॥ అంబేద్కర్ ఇటువంటి బిల్లు తెచ్చినందుకు శ్రీమతి కమలా చౌదరీ ఆయన్ను ఎక్కువ అభినందించింది. భారత మహిళలు తరతరాలుగా ఆయనపేరు తలుచుకుంటూ వుంటారనిగూడా ఆమె అన్నది.

ఈ బిల్లు హిందూధర్మానికిగాని, మతానికిగాని విరుద్ధంగాలేదని, ఏకపత్నీత్వాన్ని విధించడం యోగ్యంగావున్నదని ఆమె అన్నది. విడాకుల విషయంలో గూడా ఆమె బిల్లులోవున్న అంశాలు బాగావున్నాయన్నది.

స్త్రీలకు ఆస్తివిషయంలో వారసత్వం కల్పించడం విషయంలో ప్రతిపక్షులు వాదిస్తున్న పద్ధతిలో బలం అంతగాలేదని శ్రీమతి చౌదరీ అన్నది. తండ్రికీ, కూతురు, కొడుకు ఒక్కటే అయినప్పుడు ఆతని ఆస్తిలో ఆతనికి భాగంవుంది, ఆమెకు ఎందుకులేకపోవాలని ఆమె ప్రశ్నించింది. స్త్రీలు తండ్రి ఆస్తిలో తమకుగూడా భాగం కావాలని కోరడం ఇప్పటినుంచి కాదు. అనాది సిద్ధంగా వస్తూవున్నదే. అందుకు ప్రమాణంగా కావలసినంత వాఙ్మయంవున్నది అని శ్రీమతి కమలాచౌదరీ తన ఉపన్యాసాన్ని ముగించింది.

దర్భంగా మహారాజాబిల్లును వాయిదా వేయవలసిందని కోరారు. ఆయన బిల్లును పూర్తిగా వ్యతిరేకి. బిల్లువిడాకులకు ఆస్తికం పకానికి సంబంధించి వున్న అంశాల వల్ల కోర్టులకు బాగు పడతాయి తప్ప, మరెవ్వరికి లాభం కల్గదని ఆయన అన్నారు. ఇన్ని కారణాలను పురస్కరించుకొని డా॥ రాజన్ బాబు అన్నట్లు దాన్ని వాయిదా వేయవలసిందిగా ఆయన కోరారు.

డా॥ పట్టాభి మాట్లాడటానికి లేవడం తరువాయిగా సభలో ఒక మూలనుంచి బలపరచండి అని, ఇంకో మూల నుండి విమర్శించండి అని కేకలు బయలు దేరినాయి. ఇటువంటి విషయాల్లో మనకు పట్టుదలవుండరాదని ఆయన ప్రసంగించడానికి ఉపక్రమించారు.

కొన్ని వేల సంవత్సరాలు సజీవంగా బ్రతికివున్నట్టుగా వస్తూ వున్న సంఘాన్ని మనం సంస్కరించడానికి పూనుకుంటున్నాం. అర్థశాస్త్ర రచనా కాలంలో కౌటిల్యుడు ఎటువంటి సమస్యలను ఎదుర్కొన్నాడో, అటువంటి సమస్యలనే నేడు గూడా మనం ఎదుర్కొంటున్నాం. ఏమైనా హిందూ సంఘం సమ సమాజ సిద్ధాంతం మీద కట్టబడింది. ఇప్పుడు దాన్ని నాశనం చేద్దామని మనకు పుట్టింది అందుకు పూనుకుంటున్నాం.

ఇప్పటికే పుట్టుకవల్ల గాక, బ్రతికివుండం వీద ఆస్తి పంపకానికి డా॥అంబేద్కర్ దారితీసాడు. రేపు ప్రథమ సంతానానికే ఆస్తిగాని లేకుండానావుకుతేవని ఆయన ఇంకోబిల్లు తెస్తారు. దానితో పూర్వపు కట్టడమంతా కూలిపోయి, వర్గసమాజం ఏర్పడటానికి దారి ఏర్పడుతుంది.

సమ సమాజ సిద్ధాంతంమీద నిర్మించబడిన హిందూ సమాజంలో ఆస్తికి, సంస్కృతికి సమ భాగస్వామ్యం వుంటూ వచ్చింది. ఇప్పుడు దాన్ని మనం సంస్కరించాలి అని అనుకుంటున్నాం. కాని ఇందుకు ముందు ఒక పరిశీలనసంఘాన్ని నియమించి, ఆ సమాజంయొక్క స్థితిగతులను, బాగోగులను విచారించామా? టారిఫ్‌రక్షణలు అటువంటి వాటి విషయంలో పెట్టుబడిదార్ల అభిప్రాయాలను మనం స్వీకరిస్తాంగాని, ఇటువంటి విషయాలలో ప్రజాభిప్రాయంగూడా మనకు అక్కరలేదు.

ఇప్పటికే పది సంవత్సరాలక్రితంనుంచి ఈ బిల్లు ఇట్లాగే వున్నది. అసలు కొత్తగా వచ్చిన రోజు కాంగ్రెస్ శాసన సభలను బహిష్కరించింది. సర్ బి. ఎన్. రావు ఈ బిల్లును రచించారు. ఆయన బ్రిటిష్ కోర్టులలో జడ్జిగా వుండి బ్రిటిష్ ధర్మాలను, దాయ భాగాన్ని బాగా అర్థం చేసుకున్నారు. ఆయనకు మితాక్షరి విషయం అసలు తెలియదు. అందువల్ల అప్పుడు న్యాయశాఖా సభ్యుడుగా వున్న శ్రీ కోకా శేదీ ముఖం గూడా చూడలేదు.

సమాజాన్ని సంస్కరించాలి అనే వాళ్ళలో నేనుగూడా ఒకణ్ణే. అందుకు నేను విరోధిని కాదు విడాకుల విషయంలోగూడా నాకంత పట్టింపు లేదు. నా భార్యను వదిలి వేద్దామని నాకు చాలా కాలంగా వుంది. నా భార్యకుగూడా అట్లాగే వున్నదని వినికిడి. కాని నాకు పట్టింది ఏమిటంటే, మనకు స్వరాజ్యం వచ్చిన తరువాత భారతీయమైన వ్యవస్థల పట్ల మన ప్రవర్తన ఎట్లా వుండాలి అన్నదే. అందువల్ల ఈ బిల్లును ఈవిధంగా పార్లమెంటులో ప్రవేశ పెట్టడం నాకు రుచించడంలేదు.

ఈ బిల్లును గూర్చి మనం ఎన్నికల ప్రణాళికలో ఒక ముక్కగూడా వ్రాయలేదు. పరిక్రమలను జాతీయం చేస్తామని, అది చేస్తామని, ఇది చేస్తామని మాత్రం అందులో చాలా వ్రాశాం. సమాజ సంస్కరణకు పూనుకుంటామన్న ముక్క గూడా అందులో లేదు. అందులో ఇది సంస్కరణ అయితే బాగానే వుండును. అట్లా కాదు. సంఘాన్నే మార్చుదామని మాట్లాడుతున్నది. సంఘం, మతం, వద్దు అనేవాళ్లుగా వున్నాయి. నాకు మతంలో నమ్మకం లేకపోవచ్చు. నా పొరుగువాడిని గూడా నేను దృష్టిలో వుంచుకోవాలి.

సమిష్టి కుటుంబంవుంది అది ఒక్క ఇన్సూరెన్సు ట్రస్టువంటిది. దానితో సమానమైన దానిని మీరు కొన్ని వేల ఏండ్లు తపస్సుచేసి గూడా సృష్టించలేరు. అందులో లోపాలువుంటే వుండవచ్చును. మనం ఆ లోపాలను సరిచేసి, దానియొక్క శ్రేష్ఠత్వాన్ని ప్రజలకు నచ్చచెప్పాలిగాని, లోపాలు వున్నాయని దాన్ని నాశనం చెయ్యడం భావ్యంకాదు.

అందువల్ల ఇటువంటి బిల్లును చట్టంగా చేయదలచుకున్నప్పుడు ప్రజల అభిప్రాయం ఏమిటో తెలుసుకోవడం అత్యవసరం. అధిక సంఖ్యాబలం వుందిగదా అని మురిసి లాభంలేదు. తరువాత వచ్చే ఫలితాలను గణించాలి. నేను సంస్కర్తగా మారేనాటికి ఈ పార్లమెంటులో సగంమంది పుట్టిగూడా వుండరు. అందువల్లనే ఈ విషయంలో మనం కొంచెం నెమ్మదిగాపోవడం మంచిదని సలహా ఇవ్వగలుగుతున్నాను.

మనం ఎన్నికల ప్రణాళికలో పరిశ్రమలను జాతీయంచేస్తామని ప్రజలకు మాట ఇచ్చాం. కాని అట్లా చేయలేక పోయినాం. ఎందుచేత? పెట్టుబడిదార్లు అడ్డుపడ్డారు. దాని గుణపాఠం ఇప్పుడు మనకు తెలిసివచ్చింది. వారు లాభాలను బాగా గుంజుకుంటున్నారు. ఎప్పుడో ఒకరోజున మనం ఈ పెట్టుబడిదారులమీద పడే పన్నులను సగానికి సగం తగ్గిస్తాం దానితో అతడు కోటల్లో పాగా వేస్తాడు.

మనకు పరిశ్రమలను జాతీయం చెయ్యడం భయంగావుంది. సాంఘిక మార్పులు తువ మట్టించడం సంకోచంగావుంది ప్రాజెక్టులు కట్టడానికి వీరికి గావుంది గృహ పరిశ్రమలను అభివృద్ధిలోకి తీసుకురావడం గిట్టడంలేదు ఉద్రిక్త వేత్తలు ద్రవోల్బణం ఎక్కువౌతుందని భయపడుతున్నారు. మనం వెనక్కి తీస్తున్నాం. అందువల్ల ఈ బిల్లును ప్రజాభిమతానికి వదలడం మంచిది అని నేను సలహా ఇవ్వడంలో తప్పేమీ లేదను కుంటాను. (సశేషం)

# ఎలక్ట్రిక్ రైలుమార్గాల విస్తరణ

## పార్లమెంటులో ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 13: మద్రాసులో, తాంబరం-చెంగల్‌పట్‌కు ఎలక్ట్రిక్ రైలుమార్గాలని ప్రభుత్వం ఆలోచించుతున్నదనీ అయితే ప్రభుత్వం దీంట్లో ఇప్పుడు పెట్టుబడి పెట్టగలగటం ఎంతవరకు సాధ్యమో చెప్పలేనని రైల్వే మంత్రి ఈవేళ పార్లమెంటులో తెలియజేశారు. ఇలాంటిపథకాలు యింకా చాలా వున్నాయన్నారు.

# 'రు. 25 లు శిస్తుకట్టే రైతులను అప్పు వసూళ్లనుండి మినహాయించాలి'

## మార్కాపురం తాలూకా రైతుకాంగ్రెస్ సభతీర్మానం

మార్కాపురం, డిసెంబరు 10: —

"నానాటికీ, ప్రజాసామాన్యంలో కాంగ్రెస్‌పై వ్యాపించుచున్న అసంతృప్తి, అవిశ్వాసాన్ని యినుమడింపజేసి, కాంగ్రెస్ సేవకులను గ్రామాలలో తిరుగుటకు వీలులేని పరిస్థితులు కల్పించుట తప్పితే ప్రస్తుత మద్రాసు ప్రభుత్వ "నిర్బంధ అప్పు సేకరణ విధానం వలన వేరులాభంలేదు." అని ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెస్ కార్యదర్శి చేగిరెడ్డి బాలిరెడ్డిగారు, మార్కాపురం తాలూకా రైతు కాంగ్రెస్ మహాసభను ప్రారంభించుతూ అన్నారు. సభకు బింకి రామిరెడ్డిగారు అధ్యక్షత వహించిరి.

బాలిరెడ్డిగారు తమ ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ యిల్లా అన్నారు.

"వ్యవసాయంఖర్చులు విపరీతంగా పెరిగిపోతూన్నవి. పశువుల ధరలు యుద్ధానికి ముందుకంటే 5, 6 రెట్లు పెరిగినవి. వ్యవసాయ పరికరముల ధరలు గూడ విపరీతంగా పెరిగిపోయినవి. కూలీలు గూడ దినదినానికి హెచ్చు జీతాలు కోరుతూయున్నారు. యివ్వక తప్పటం లేదు. ధాన్యపు ధరలుమాత్రం యుద్ధ పూర్వానికి 3 వంతులు పైగా పెరుగలేదు. ధాన్యమునకు గరిష్ఠ ధరలు నిర్ణయించారే కాని, కనిష్ఠ ధరలు నిర్ణయించలేదు. వ్యవసాయకుల జీవితమంతా దిన్నగండంగా పరిణమించింది. నియమము, క్రమము లేకుండా ధాన్యసేకరణ్ని నిర్బంధంగా సాగించుట చేర్చిన ప్రభుత్వం రైతు అవసరాలను గమనించలేక పోవడం, కోచనీయం ఇదే విధానం మరికొంత కాలం సాగితే అరాచకం ఏర్పడ గలదు. 100 కి 75 మంది రైతులున్న మన దేశంలో వారికి సంబంధించిన రోజువిమయం మెచ్చిన నూ ప్రభుత్వం రైతుల అభిప్రాయము కనుగొనుట ప్రథమ కర్తవ్యము. రైతుల అభిప్రాయాలతో నిమిత్తములేకుండా నిర్బంధ అప్పుల వసూళ్ళకు పూనుకొనుట నిరంకుశ ధోరణిని సూచిస్తుంది. ప్రజాస్వామ్య ప్రభుత్వాలకిది తగని పని.

ప్రభుత్వాలు, పట్టణవాసులు, పారిశ్రామికులపై పక్షపాతం చూపుతున్నాయని బాలిరెడ్డిగారు విమర్శించారు.

అనంతరం మార్కాపురం తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి ఎక్కలి రామయ్య రఘువారి సుబ్బారావుగారలు ప్రసంగించారు.

దేశభక్త వెంకటప్పయ్య, కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్యగారల మరణమునకు సానుభూతి తెలియపరచుతూ, ఒక తీర్మానం చేశారు. రూ 10 కి బదులు 25/-రూ శిస్తు కట్టే రైతులందరినీ నిర్బంధ అప్పు వసూళ్ళనుంచి మినహాయించాలనియూ, రైతులకు పూరకులపు సామానులు సరఫరా చేయుటకు వ్యవసాయ డిపోలు స్థాపించాలనియూ, ఇనుప కమ్మలు, పాతలు, తగరపు రేకులు యెక్కువగా సరఫరా చేయాలనియూ తీర్మానాలు చేశారు.

మరొక తీర్మానములో ధాన్య సేకరణ యొకరానికి పూర్వము వలెనే ఒక బస్తా వసూలు చేయాలనీ, దీనిని హెచ్చు చేయుట అన్యాయమని తరుసు క్రింద బస్తా 18 4 శేర్లు నిర్ణయించుట అన్యాయమనీ, పూర్వము వలెనే ఒక శేరు వసూలు చేయుట ఉచితమనీ తెలియజేశారు. గ్రామాలకు కిరసనాయిలు కోటా హెచ్చు చెయ్యాలని కోరారు.

# "రాయలసీమలో వసూలు చేయరాదు"

## రాష్ట్రఆహారమంత్రికి అనంతపురం జిల్లాబోర్డు విన్నపం

అనంతపురం, డిసెంబరు 11: మద్రాసు ప్రభుత్వ ఆహార, మత్స్యశాఖమంత్రి రోచిన్గ్జోరియాగారు తమ రాయలసీమ సంచారములో నిన్న మధ్యాహ్నం ఇచటికి వచ్చిరి.

జిల్లా కలెక్టరు కార్యాలయంలో 4 గంటలకు జరిగిన ఆహారసంఘ సమావేశమున ఈ జిల్లాలోని ఆహారధాన్య పరిస్థితిని గురించి వివరములు తెలుసుకొన్న తర్వాత జిల్లా కలెక్టరు, కె. రాధాకృష్ణయ్యశెట్టి జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు, కల్లూరి సుబ్బరావు ఎం. ఎల్. ఎ., రాయప్ప, ఎం. ఎల్. ఎ., డి. కదిరప్ప ఎం. ఎల్. ఎ., కె. జాఫర్ మోడీన్ ఎం. ఎల్. ఎ. మొదలగు వారితోగూడ జిల్లాబోర్డు ఆఫీసుకు సాయంకాలం 5 కు విచ్చేసిరి

జిల్లాబోర్డు అధ్యక్షులు కె. వి. వేమారెడ్డి, ఉపాధ్యక్షులు ఎ. చిదంబరరెడ్డిగార్లు మంత్రిగారికి స్వాగతమిచ్చిరి. ఆ సందర్భమున జిల్లాబోర్డు భవనమున ఏర్పాటైన సభకు జిల్లాబోర్డు సభ్యులు, అధికారులు, పురప్రముఖులుచాలమంది హాజరైయుండిరి.

ధైవ ప్రార్థనానంతరం జిల్లాబోర్డు తరఫున కె. వి. వేమారెడ్డిగారు మంత్రిగారికి స్వాగతపత్రము సమర్పించుచు ఈ జిల్లా విషయములను గురించి ప్రభుత్వమువారు ఆలోచించునపుడు, దీనియొక్క సహజ పరిస్థితులు గమనించి ఔదార్యముతోను, సకాలములోను సహకరించుటకు తోడ్పడవలెనని కోరిరి.

"సెకండరి విద్యాలయములు, హైస్కూలు ఈ జిల్లాలో చాల కొరవడియున్నది ఉన్న వాటికి భవనములులేవు కనుక ప్రభుత్వము భవననిర్మాణమునకు ధారాళముగ గ్రాంటు లివ్వవలెను. ప్రాజెక్టులకు ప్రభుత్వమువారు ప్రారంభోత్సవములు చేసినారు. ఆహారోత్పత్తి దృష్ట్యా నైనా వాటి నిర్మాణము త్వరలో ప్రారంభించి ముగింపగోరుచున్నాము. చెరువుల మరమ్మత్తు నవీన వ్యవసాయ పద్ధతులు విరివిగా చేయించవలెను. రైతుకు కావలసిన ఇనుపసామానులు, సిమెంటు, గానుగపిండి మొదలగునవి సులభముగను విరివిగను లభింపచేయవలెను. ముఖ్యముగా మా తాలూకాల దారిద్ర్యమును గమనించి రైతుల నుండి ప్రభుత్వమువారు నిర్బంధముగా వసూలు చేయదలచిన అప్పును వసూలు చేయక విరమించుకొనవలెను." అని స్వాగత పత్రంలో వివరించబడెను.

మంత్రిగారు ప్రత్యుత్తర మొసగుచు తమను సన్మానించినందుకు జిల్లాబోర్డు వారికి కృతజ్ఞత వెల్లడించి, తాము జిల్లాలోని వాతావరణ్ని ఆహారపరిస్థితులను గమనించ వచ్చితిమనియు బోర్డుసభ్యులును ఇతర ప్రముఖులును తమపలుకుబడిని అనుభవ విజ్ఞానములను ఉపయోగించి ఆహారోత్పత్తి అధికతరచుటకును, ధాన్యేతరములను మత్స్యములు, కూరగాయలు మొదలగువాటి పెంపకము వాడుక అభివృద్ధిచేసి ధాన్యమునకు గిరాకీ కొంతవరకైనా తగ్గింప ప్రయత్నపడుచు ప్రభుత్వముతో సహకరించవలెనని కోరిరి.

పాఠశాలాభవనములు మొదలగు అవసరములగూర్చి వాటికి సంబంధించిన మంత్రిగారికి తెలియజేసెదననిరి. ఈ ప్రాంతపు అభివృద్ధికొరకై ప్రభుత్వమొక అభివృద్ధి సంఘమును నియమించి కృషిచేయుచున్నదనీ, రైతులకు కావలసిన ఇనుపవస్తువులు లభించినంతవరకు అధికారుల ద్వారా పంచబడుచున్నవనీ, అవి అవసరమైనవారికే చెందునట్లు చూడుట ప్రజానాయకుల విధిఅనీ అన్నారు. పంపకములోని లోపములు జిల్లా అధికారులకు తెలియ చెప్పుట మంచిదన్నారు.

ప్రభుత్వమువారు రైతులనుండి వసూలు చేయదలచిన అప్పువిషయమై ఇంకను నిర్ణయమునకు రాలేదనీ, కాంగ్రెసు అసెంబ్లీ పార్టీలో ఆలోచించునపుడు మీ కోరికను ఎరిగింతునని అన్నారు.

... ఇతర ఆహార పదార్థములు ... మంచి చేపలు వాడిలో మత్స్యములు భుజించువారు ... కూరగాయలు ... వని గ్రహించవలెను. ధాన్యపుకొరతను కొంతవరకైనా తగ్గించవలెను, అవిధముగా చేసినచో మనకు జీతము కడుపుకూడ ఎంతయో ఉపకరించిన వారగుదురు. ఆహారములో పనుచే ఇంతవరకు మనరాష్ట్రములో ఎవరును పస్తుపడలేదు. ఈ గంట్లో ల్లు అంత వరకైనా ఉపయోగపడవలెను"

ఉత్తర సర్కారు ప్రాంతము లో రూపాయ వల్ల చాలావ్యను సంభవించినది. ఈఆపత్సమయమున వీరు ఔదార్యముతో వారికి సహాయపడవలెనని కోరుచున్నాను అని మంత్రిగారు నుడివిరి.

జిల్లాబోర్డు సభ్యులు మంత్రిగారికి పరిచయము చేయబడిన తర్వాత అధ్యక్షుల వందనముతోను 'జనగణమన' గీతముతో కార్యక్రమము ముగిసెను. స్వ. ౧.

## గుంటూరుజిల్లా నూర్‌బాష్ సంఘ కార్యవర్గసభ

గుంటూరు, డిసెంబరు 11: ఈ జిల్లా నూర్‌బాష్ సంఘ కార్యవర్గ సమావేశము జనాబ్ షేకు ఆదంసాహెబుగారి అధ్యక్షతను గుంటూరు రవాదారి బంగళాయందు మొన్న జరిగింది. ప్రత్యేక ఆహ్వానంపై కాంగ్రెసునాయకులు పుల్లెల రత్నయ్య, పేరిశ సుబ్బారావు, జిల్లాబోర్డు సభ్యులు పఠానం రామసుబ్బారావు షేక్ హసన్ సాహెబుగార్లు హాజరైరి.

పై ప్రముఖులందరు సాయంత్రం జరిగిన బహిరంగసభలో పాల్గొన్నారు, దూదేకుల కాలంలో విద్యావకాశములను గురించి, యింకా పలు సమస్యలపైన ఉపన్యాసాలు చేశారు. తనువరి యీ క్రింది తీర్మానములు యేకగ్రీవంగా ఆమోదించారు.

రుపాసు నిధికి జిల్లాసంఘమునుండి రు. 50/-లు విరాళంగా యిచ్చుట కున్నూ, ఆంధ్ర రాష్ట్ర వినుకబడిన జాతుల మహాసభకు రు. 50/-లు వసూలు చేసి యిచ్చుటకున్నూ తీర్మానించారు. ఆంధ్రరాష్ట్ర నూర్‌బాష్ మహాసభ గుంటూరులో జనవరినెలలో జరుపుటకు నిశ్చయించడమైనది, నేతకు వారికి నేయు సౌకర్యములన్నియూ, నూలు, నేత పని చేయువారికి గూడా లభించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

## పామిడి హైస్కూలు

అనంతపురం, డిసెంబరు 11: పామిడిలో హైస్కూలుకుగాను ఆయూరి కర్తలు త్రి టంగుటూరు సంజీవయ్యగారు రు 25000/- లు విరాళమిచ్చుట కంగీకరించుటచే, వారి కోరికప్రకారం ఆ పాఠశాలకు టంగుటూరి చిన్నప్ప హైస్కూలు అని నామకరణ మొనర్చుటకు జిల్లాబోర్డు వారు అనుమతించిరని తెలుయుచున్నది. (స్వ. వి.)

# 'రాష్ట్రాభివృద్ధి పథకాలనుగురించి ఆలోచించటం అవసరం'

## కాంగ్రెస్‌కార్యదర్శి కళా వెంకట్రావుగారి వివరణ: కాకినాడలో నేతాజీ పార్కుకు ప్రారంభోత్సవం

కాకినాడ, డిసెంబరు 12: నిన్న సాయంకాలం జగన్నాథపురంలో నేతాజీ సుభాష్ చంద్రబోస్ పార్కుకు ప్రారంభోత్సవము జరుపుతూ అఖిలభారత కాంగ్రెసు సంఘ కార్యదర్శి కళా వెంకట్రావుగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యా పరిష్కారం 30 రోజులలోనే కావచ్చుననియు, కానిపక్షంలో 100 రోజులు వ్యవధికూడ పట్టవచ్చుననియు అభిప్రాయము వెలిబుచ్చిరి

భాషా ప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడితేనే తప్ప ప్రజలందరికి తెలిసేభాషలో పరిపాలన జరగటం కష్టమన్నారు. పార్టీల కార్యక్రమాన్ని ప్రజాకోర్కెలనుబట్టి ప్రజలు తర్కించి వోటివ్వవలసిన రోజులు వచ్చినవి. అందుచేత ప్రజాభాషలో పరిపాలన జరగటం అత్యంతావశ్యకమని వెంకట్రావుగారు ఉద్ఘాటించిరి. రాష్ట్రం వస్తుందని సంతోషించటంతో బాటు రాష్ట్రాభివృద్ధి స్కీములగురించి ఆలోచించాలనియు, మనకు వచ్చే ఆదాయంతోటి, ప్రజాస్వామ్య బుద్ధితోటి పరిపాలింపవలసిన బాధ్యత మనమీద (కాంగ్రెసుమీద) వున్నదనియు హెచ్చరించిరి.

ఆంధ్ర రాష్ట్రానికి ప్రధాన పట్టణం కాకినాడ నగరమేయని రాష్ట్రములో తేవని వెంకట్రావుగారనిరి. ఆటంకాలున్న ప్రమాదము కనబడుతున్న యీ రోజులలో ఒకే పట్టణమున ప్రభుత్వ కార్యాలయాలు, కోర్టులు, కాలేజీలు, పరిశ్రమలు కేంద్రీకరించడం మంచిది కాదనిరి. వికేంద్రీకరణపద్ధతి అవలంబించుట శ్రేయస్కరమనిరి, దీనివలన ఖర్చుకూడ తగ్గగలదనిరి.

పల్లెటూరి జీవితాన్నుంచి పట్టణ జీవితానికి యుద్ధపర్యవసానంగా ప్రజలు హెచ్చుమంది తరలివచ్చినందున పట్టణములు బొత్తుగా అధ్వాన్న స్థితిలోనికి వచ్చి పరిశుభ్రమైన గాలి పీల్చుకొనుటకుకూడ వీలులేని వాతావరణం యేర్పడినదనియూ, అందువలన యిటువంటి పార్కులు, విశ్రాంతి స్థలాలు భాగ్యవంతులకే గాక, బీదలకు, కూలీజనమునకుకూడ యెంతైనా అవసరమనియూ చెప్పిరి. ఏడాదిక్రితం పార్కుకు శంకుస్థాపన తనుచే చేయించి, తిరిగి పార్కు ప్రారంభోత్సవము జరుపు అవకాశముకూడ తనకు లభింపజేసినందుకు పురపాలకసంఘము వారికి వెంకట్రావుగారు కృతజ్ఞత తెలియజేసిరి.

మ్యునిసిపలు చైర్మన్ డాక్టర్ యిటుసి శాఁపతిరావుగారు వందనము అర్పించిరి. పార్కులో సుభాష్‌బాబు విగ్రహాన్ని బాబాసింగుగారున్ను, రేడియోను కాదచంద్రుడుగారున్ను, రేడియో గృహమును సామినేని సత్యనారాయణగారున్ను నెలకొల్పి మ్యునిసిపాలిటీకి బహూకరించినందుకు చైర్మన్‌గారు వారికి కృతజ్ఞత వెల్లడిచేసిరి. 'జనగణమన' జాతీయగీతంతో కార్యక్రమం ముగిసెను. రాత్రి పెండ్యాల వెంకటదాసు గారు, ఎం. ఎల్. ఏ., గారింట్లో విందారగించి యీ రోజు ఉదయమున కళా వెంకట్రావుగారు అమలాపురం వెళ్లిరి (స్వ. వి.)

